# ఆఖరు కోరిక

[కథల సంపుటి]

రచయిత:
ఎన్. ఆర్. చందూర్



పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# ఆఖరు కోరిక

విశ్వం రోమనుహిస్టరీ దీక్షగా చదువుతున్నాడు. తన రూము తలుపు తోసిన శబ్దం కూడా అతనికి వినిపించలేదు. గ్రంథపఠనలో మునిగిపోయాడు.

"విశ్వం!" అన్నాడు మురళి, నెమ్మదిగా.

విశ్వానికి వినిపించనేలేదు. అతని నేత్రాలు యింకా పంక్తుల్ని వెన్నాడుతూనే వున్నాయి; మెదడులోని శక్తులు వాటిని అవగాహన చేసుకుంటున్నాయి.

"విశ్వం!" అన్నాడు యింకోసారి మురళి, మరి కొంచెం బిగ్గరగా. అతని మొహం ఏదో ఆందోళనని దాచుకుంది.

ఈసారి విశ్వానికి వినిపించింది వెనక్కి తిరిగి చూశాడు. పుస్తకం 'ధన్' అను శబ్దం చేస్తూ మూసేసి, కుర్చీలోనుంచి లేచి, స్వాగతమిస్తున్న వానిలా ఎదురుగా వెళ్ళి, మురళి రెండు భుజాల మీదా చేతులు వేసి అతన్ని ఒక్కతఫా వూపి–"హల్లో" అంటూ...

ఏమిటో అనబోయాడు. అంతవరకూ విశ్వం మురళి మొహంలోకి చూడలేదు. అప్పుడు చూశాడు.

"అలావున్నావేమిటి, మురళీ!"

"మన ఆదర్శాలు పుస్తకాలలోని వ్యక్తులలో చూసి సంతోషించవలసిందేగాని ఆచరణీయములు కావేమో అని భయపడుతున్నాను."

ఇలాటి స్టేటుమెంటువల్ల ఏమీ బోధపడదు. మనం తరుచూ ఫిల్ములలో వింటూవుండమూ—ఈ జగత్తు అంతా ప్రేమ మయమని ఒక పాత్రా, విషాదసాగరమని యింకో పాత్రా అనడం. అలాగే మురళికూడా మాట్లాడాడు,—ఆదర్శాలు ఆచరణీయములు కావని. అలాటి స్టేటుమెంటు వల్ల విశ్వం ఎలా తెలుసుకోగలడు—తను పిడుగులాటివార్త వినబోతున్నాడన్న విషయం!

"ఊ భయపడడు,...విభూతి కావాలా?"/

ఈ చమత్కారం మురళిని మరింత బాధపెట్టింది. విశ్వానికి ఆ విషయం తెలియకపోబట్టి గదా అంత తేలికగానూ, ఖులాసాగానూ మాట్లాడగలిగాడు!

తెలిస్తే? ఎంత కుంగి పోతాడో! చెప్పక పోదామా అనుకున్నాడు ఒక క్షణం. కాని చెప్పకుండా ఎలా? ఎలాగయినా సరే చెప్పి తీరాలి.

"ఈ పాడు ప్రపంచంలో పవిత్రతకీ, ప్రేమకీ స్థానం వుండంటావా?"

"ఉండన మంటావా, లేదనమంటావా? నీ అభిప్రాయమేమిటో చెప్పు. ఉండనమంటే,.వుందంటాను. లేదనమంటే, లేదంటాను. ఏమనుకుంటావో చెప్పు, మురళీ"

"లేదు సుమా!"

"ఊ లేమతే!"

మురళికి తను ఏరకంగా చెప్పాలో తెలీడం లేదు. డొంక తిరుగుడు మార్గాలు వదిలేసి, ఏక శాకీని చెప్పడానికి సిద్ధ పడ్డాడు.

"ఇప్పుడే వైరు వచ్చింది."

"ఈ పాడు ప్రపంచంలో పవిత్రతకీ, ప్రేమకీ స్థానం లేదనా?"

మురళి మొహంలో చమత్కార పరిణామం స్పష్టంగా కనిపించింది.

"విధి నిర్ణయం బలవత్తర మయినది సుమా!" మురళి అన్నాడు

విశ్వం టేబుల్ దగ్గిరికివచ్చి నోటుబుక్కూ, రెండు టెక్స్టులూ తీసుకుని, మురళివైపుతిరిగి 'కాలేజీకి టైము అవుతోంది. సామెతలూ, నీతివాక్యాలూ, తత్సంబంధమయిన వన్నీ ఒక కాగితంమీదరాసి, సాయింత్రం నాకుయియ్యి, అవన్నీ కంఠోపాఠం చేసి...' అన్నాడు. వాక్యం పూర్తి చెయ్యకుండా తన మాటలు ఎలాటి పరిణామాన్ని కలగ చేస్తున్నాయో తెలుసుకుందామనే కుతూహలంతో మురళి మొహంలోకి చూశాడు.

"వి...శ్వం..." ప్రయత్నంతో, పలికాడు మురళి.

"ఊఁ"

"లీలకి యింకో సంబంధం నిశ్చయించార్ట మా మామయ్య"

విశ్వం తన చెవుల్నే నమ్మలేకపోయాడు.

"ఏమిటీ?"

"లీలకి యింకో సంబంధం. మామయ్య నిర్ణయం."

విశ్వం చేతులోనుంచి ఒక పుస్తకము జారి కింద పడిపోయింది. మిగతా రెండు పుస్తకాలూ టేబుల్ మీదికి గిరవాటు వేశాడు.

విశ్వానికి ఒక్కసారిగా తన నేత్రద్వయం ఈ పంచభూతమయప్రపంచాన్ని చూట్టం మానేసి, అంధకారాన్ని—ఆశ అనే దివిటీ కూడా లేని అంధకారాన్ని—చూస్తున్నట్లుగా తోచింది. పోను పోను, తను అనే దేహం కల మనిషి లేనట్టూ చైతన్యశక్తి ఒక్కటీ మాత్రం వున్నట్టూ, క్రమేపీ ఆశక్తి అనంతమయిన అంధకారంలో లీనమై పోతున్నట్లూ—.........,

మూడు నిముషాలు యిద్దరూ నిశ్శబ్దతలో నుంచుండి పోయారు.

ఏదో జ్ఞప్తికి వచ్చిన వానిలా 'లీల వొప్పుకుందా, మురళీ?' అన్నాడు విశ్వం.

"వొప్పుకోక......" అన్నాడు మురళి, దీనంగా, అతని దీనస్వరంలోనూ, హృదయంలోనుంచి వెలువడే అమృత వాక్కులోనూ, జాలి కురిపించే చూపులోనూ మూర్ఖప్రజల నిబంధనలలో యిరుక్కున్న చెల్లెలు లీల అసహాయతా, అతనికి పవిత్రాదర్శాలమీద వుండే అపూర్వాభి

మానమూ చూడ్డానికి కళ్ళువున్నవారికీ, గ్రహించ డానికి బుద్ధి వున్నవారికీ స్పష్టంగా కనిపిస్తూనే వున్నాయి.

# 2

లీలావతికి అయిదేళ్ళు; మురళికి తొమ్మిదేళ్ళు. అప్పట్నుంచీ మాణిక్యాంబ వారిద్దరికీ మాతృస్థానమే కాకుండా పితృస్థానం కూడా, భర్తీ చెయ్యవలసి వచ్చింది. పిల్లల మేనమామ పైన వుండి పొలం పుట్రా జాగర్తగా చూస్తూ వారి ఆస్తి పాస్తులు చెడిపోకుండా కాపుదల చేస్తూ వుండే వాడు.

కాలక్రమేణా ఆ యింట్లో రవణయ్యమామకి ఒక స్థానం ఏర్పడింది. గౌరవమూ, దాని వెంటనే అధికారమూ కలిగాయి: అతని పెద్దరికాన్ని చెల్లెలు కూడా తోసిపుచ్చలేక పోయేది.

రవణయ్య పంతులయినా తొందరపాటు మనిషి కాదు. తన చెల్లెలు సంతానానికి అన్యాయం చేదామన్న తలంపువున్న నీచుడు కాదు. ఎటొచ్చీ, అతని యుగం వేరు, లీలయుగం వేరు. కాలమార్పుని గమనించి ఆ మార్పుకి అనుగుణంగా తన అభిప్రాయాల్ని మార్చుకోగలిగిన భావసంపద రవణయ్యకి అలవడలేదు.

లీలావతి రవణయ్యతో అంది : 'నాకీ సంబంధం యిష్టం లేదు,

"ఏం చేత ?" నవ్వుతూ అడిగాడు మామ.

"నా కిష్టం లేదు."

"కారణాలు లేవా ?"

"ఉన్నాయి"

"చెప్పు"

"నా చేత చెప్పించ నక్కరలేదు. నీకు తెలుసు"

రవణయ్య నవ్వాడు. వికటమూ, హేళనా ఆ నవ్వు లోనుంచి తొంగి చూస్తున్నాయి.

లీలకి కొద్దిగా వుడుకుమోతుతనం వచ్చింది. ఉడకడానికీ, సంకోచించడానికీ, భయపట్టానికీ, గుపట్టానికీ అది సమయం కాదనీ, తన జీవిత రేఖ దిద్దుకోవలసిన అదను అనీ ఆమెకి తెలుసు.

"నేను విశ్వాన్ని ప్రేమిస్తున్నాను."

"ఇక ముందు మానెయ్యి"

రసరాహిత్యమయిన ఆ పదాలు లీల లేతగుండెని ఎంత కుంగదీశాయో ! కాని, ఆమె కుంగిపోతే ఎలా ? ధయిర్యం వహించాలి. తలెత్తి, చిన్నప్పట్నుంచీ తన్ను పెంచి విద్యా బుద్ధులు నేర్పిన మామయ్యతో, ముఖాముఖిగా సాహసంతో వాదించాలి.

"మానెయ్యలేను," బొంగురుగా అంది.

"ఏమీ దిగులుపడకు. రాజకుమార్తెల కథలూ, ప్రపంచ ప్రణయ గాథలూ చదివి, కష్టపడి నేర్చుకున్న ఈ చిన్న

తనపు ఆకర్షణా ప్రచండ వేగంతో వుజ్జ్వలంగా పారుతున్న కాలవాహినిలో అతి సులువుగా కలిసిపోతుంది......దూరం ఆలోచించు లీలా!" రమణయ్య చివరి మాటలలో ఓదార్పూ, గ్న్యానబోధా వున్నాయి.

ఏమి ఆలోచిస్తుంది లీల?—ప్రపంచమంటే ఏమిటో తెలియనిదీ, జీవితమంటే ఏమిటో చూడని దీను!

"నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు, నాకీ సంబంధం సుతరామూ యిష్టంలేదు."

"చిన్నతనమన్నా, నీకింకా చిన్నతనంపోదు, ఇప్పుడతనికి రెండువందల యిరవై యిస్తున్నారు సాలీనా పాతిక యింక్రిమెంటు. అకవుంట్సు డిపార్టుమెంటులో సూత్న్మగ్రాహులు గబగబా మెట్లెక్కి పైకిపోతారు. ఎన్నో పెద్దపరీక్షలు పాస య్యాడు. వింటున్నావా?"

వింటోంది—తనకీ బంధం తప్పదేమో అనే నిస్పృహతో.

"కారు—చక్కటి బంగళా—చుట్టూ పూలమొక్కలతో. సిటీలైఫ్. నౌకర్లు. అధికారం. చేతినిండా డబ్బు. వయస్సులోనే నమ్మా డబ్బు కావలసింది. పెద్దతనం వచ్చిన తర్వాత వేలకొద్దీ బ్యాంకుబాలెన్సు వుండి మాత్రం ప్రయోజన మేమిటి?"

లీలకి మనోవీధిలో కనిపిస్తున్నాయి, మామయ్య చెప్పిన వన్నీ—ఒకటితర్వాత ఒకటిగా.

"లీలా, నీకు వెర్రితనం కాని, తండ్రి అంగీకారంలేని వివాహం చేసుకుని విశ్వం ఏం సుఖపడతాడు, నువ్వేం సుఖపడతావ్ ? ఏడాదో, రెండేళ్ళో గడిచినతర్వాత- అయ్యో ! పొరబాటు చేశామని—యిద్దరూ వేళ్ళు కరుచుకుంటారు. ఎందర్ని చూట్టం లేదు ? మీారు కోరుకునేలాటి ప్రేమ వివాహం వల్ల మీా యిద్దరికీ సౌఖ్యం లేకపోవడం సరిగదా విశ్వం భవిష్యత్తుకూడా పాడైపోతుంది."

లీల ఏమీా మాట్లాడలేక పోతోంది. విశ్వాన్ని తను ప్రేమిస్తోందికనక పెళ్ళిచేసుకోవాలి. అంతే! అంతకంటె దూరం చూడలేక పోతోంది.

"లీలా, విశ్వం తండ్రిదగ్గిర ఈవిషయం కదిపాను...... మనం బీదవాళ్ళం—వారు భాగ్యవంతులు......ఈభేదం విశ్వం పరిగణించకపోవచ్చు; కాని, విశ్వంతండ్రి పరిగణించడని అనుకోవడం మన తెలివితక్కువతనం."

జీవితపు విలువల్ని రూపాయిలతో తూచవలసిన ఆవశ్యకత ఎప్పుడూ కలగని లీలకి రమణయ్య మాటలు కొన్ని సబబుగా కనిపించలేదు.

లీల, పొబోతూ, వణుకుతున్న పెదవులతో అంది. 'నా విధి.'

"నిరుత్సాహపడకమ్మా, లీలా. ప్రతిస్త్రీకీ ఒక భర్తా, ప్రతిపురుషునికీ ఒక భార్యా—అదే వివాహంలోని ముఖ్యోద్దేశం."

లీల తెల్లబోయింది. కాళ్ళు వొణికాయి. మామయ్య వివాహమనే పరమపవిత్ర సంస్థగురించి యింత చులకనగా మాట్లాడుతున్నాడు. జీవితం అంటే............? భయం వేసింది.

లోపల లోపల నవ్వుకున్నాడు రవణయ్య పంతులు.

## 3

లీలావతి మామయ్య దగ్గిర విఫలురాలై తల్లికి అపీలు చేదామని సంకల్పించుకుంది. తల్లి సాయింత్రం వంటకి కూర తరుక్కుంటున్న వేళ ఆలాపన ఆరంభించింది.

"అమ్మా, నాకీ పెళ్ళివద్దు."

ఇలాంటిగొడవ కూతురు నోటివెంట ఎన్నోసార్లు విన్న మాతృదేవతలా, 'యేమమ్మా, యేం!" అంది.

"యేమీలేదు—నాకు బావూలేదు."

"అలా అంటే ఎలాగే?"

"ఊహు! ఊహు!!"

మారాము పెడుతున్నట్లుగా నసిగింది లీల.

"అదేమిటే, ప్రతి సంబంధానికీ మూతి తిప్పుతూవుంటే ఎలా?"

ఆత్మనింద ఆరంభం చేసింది లీల. దానివల్ల యేమాత్రపు ప్రయోజన మయినా వుండక పోతుందా అని అపోహ పడింది.

"నేను అజ్ఞానంలో వున్నప్పుడే యే బడిపంతులికో యిచ్చి ముడిపెట్టేసివుంటే మీాకు పీడ వదలిపోయేది కదా!"

లీలావతి తనతల్లి సానుభూతి సంపాయించ లేకపోయింది సరిగదా, వ్యవహారం ఎదురుతిరిగింది.

"అవునమ్మా, అవును మా పొరబాటే! మీా మామయ్య ప్రోద్బలమే యింతవరకూ కొంపముంచింది. యే ఎనిమిదోయేటో ముద్దుమురిపాలతో మూడుముళ్ళ్యా పడి వుంటే, పదిమంది నోళ్ళలోనూ పడకపోయి వుందుము."

లీలకి అక్కణ్ణుంచి వెళ్ళిపోవా లనిపించింది. కాని కాళ్ళు కదలలేదు. తన్నుగురించి తల్లి యింకా యేమేమి, యేయే రకాలగా అంటుందో వినాలని వుంది.

"నా కిప్పుడు పెళ్ళివద్దు. నే నిప్పుడు పెళ్ళి చేసుకోకపోతే యేం ప్రమాదమమ్మా?"

"ప్రమాదాలు చెప్పివస్తాయటే, పిచ్చితల్లీ. ఎప్పుడు నీకేం బుద్ధిపుడుతుందో................కాలం బావుం లేదు."

"అనుమానం. నీ సంతానంమీాదనే నీ కనుమానం."

"అనమ్మా, అను. రోజులు తప్పివస్తే యిరుగూ పొరుగే కాదు—కన్నబిడ్డలే అయిన మాటలూ కానిమాటలూ అంటారు. నిన్ననడ మెందుకు? విధిని అనాలి. ఆయన చని పోవడమే తడువుగా మనకాపగం నడివీధిలో పడలా!!"

అంటూ మాణిక్యాంబ, ఒక పుష్కరానికి పూర్వం ఈ

ప్రపంచంతో సమస్త సంబంధాలూ వదులుకున్న భర్తని జ్ఞప్తికి తెచ్చుకుని, పైటచెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంది.

లీల తన ప్రయత్నంనుంచి యింక విరమించాలనుకుంది. కాని మళ్ళీ మాణిక్యాంబ అందుకుంది.

"అమ్మాయీ, అమ్మలక్కలు అనే మాటలు భరించలేకుండా వున్నాను. ఇంత చక్కటి సంబంధానికి నువ్వు వొప్పుకోక, మామూలు పాట పాడితే, నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను."

అంతకూడా సమర్థురాలే మాణిక్యాంబ. మాణిక్యాంబ లాంటి మనుషుల తరహా విచిత్రంగా వుంటుంది. వారి చేతలకి ఎట్టి వుద్దేశమూ ఆరోపించలేము. వారు చేస్తున్నంతవరకూ న్యాయమయినదనీ, మిగతాదంతా పాపపంకిలమయినదనీ అంటారు.

ఆడపిల్లలు కూడా మొగపిల్లల మాదిరిగానే చదువుకోవాలన్న అలజడి దేశంలో విపరీతంగా ప్రబలివున్న రోజుల్లో, కొడుకు పోరగా పోరగా, రవణయ్యపంతులు ఇచ్చిన హామీ మీద మాణిక్యాంబ తన కూతుర్ని కూడా హైస్కూలుకి పంపడానికి అతికష్టంమీద వొప్పుకుంది. పంపినతర్వాత, ఆ అమ్మాయి స్కూల్ ఫైనలు పాసయే దాకా చదువు మాన్పించగలగడం ఆమెకి శక్యంకాలేదు. ఒకవైపున అన్నగారూ, యింకోవైపున కొడుకూ లీలావతి

చదువు విషయంలో అతనికి ఏమాత్రం ప్రమేయం లేకుండా, అడకత్తెరలోని పోకలా నొక్కేశారు.

ప్రతిసంవత్సరమూ అంతటితో చదువు ఆపుచేయించి, ఏదో ఒక సంబంధం చూసి పెళ్ళిచేసి, తన నెత్తిమీది బరువు దించేసుకోవాలనుకునేది. కాని, ఆమె అభీష్టం నెరవేరేది కాదు. అన్ని వ్యవహారాలూ చూస్తున్న అన్నగారే ఆమె అభిప్రాయాన్ని ఖండించేవాడు. ఇన్నాళ్ళకి అన్నగారూ, చెల్లెలూ ఏకీభవించారు.

"నేనిప్పుడు పెళ్ళి చేసుకోకపోతే వచ్చేనష్టం ఏమిటో నాకు తెలీడం లేదు. నన్నెవరూ పెళ్ళిచేసుకోక పోయినా నాకు భయంలేదు. ఎంత మాత్రం వెరవను. నోట్లో నాలుగు ముక్కలు వున్నాయి. అవసరమయితే, వుద్యోగం చేసి పొట్టపోసుకుంటాను."

"ఉద్యోగం! ఆడదానికి వుద్యోగం! ఇంకా ఏమేమి రాశాడో నా నొసటని బ్రహ్మ!" అంటూ రెండు చేతులతోనూ తలబాదుకుంది మాణిక్యాంబ.

లీలావతి ఆ దృశ్యాన్ని భరించలేక, తూనీగలా జారిపోయి, తన గదిలో మంచంమీద బోర్లగిలా పడుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలెట్టింది.

రమణయ్య గదిలోకివచ్చి లీలని సముదాయించడానికి ప్రయత్నిస్తూ, 'లీలా, నా వంక చూడు' అన్నాడు,— ముడుతలు ఏర్పడుతున్న నుదిటి మీది శ్వేతబిందువుల్ని తుడుచుకుంటూ.

చక్రాల్లాంటి కళ్ళల్లోంచి ప్రవాహంలా జారుతున్న కన్నీళ్ళతో, బెదిరిన లేడి పిల్లలా, నిస్సహాయంతో, అతి దైన్యంగా రవణయ్య వంక చూసింది లీలావతి.

"నా మాట విను, లీలా"

"......................."

"విచారించకు, లీలా."

శూన్యతలోకి చూస్తోంది లీలావతి. ఆమె హృదయంలో కూడా ఆ శూన్యతే సాక్షాత్కరిస్తోంది. అంతా శూన్యం,

"వింటావు కాదూ?"

"—...ఊఁ.....వింటాను........"

వినక.........???

అక్కడ విశ్వం ఆలోచిస్తున్నాడు. మధ్యాహ్నం కాలేజీకి పోలేక పోయాడు. చెప్పవలసిన కబురు కాస్తా చెప్పి, మురళి తప్పుకున్నాడు.

విశ్వం ఆలోచిస్తున్నాడు,—లీలలేని తన జీవితం నిష్ఫలమని. క్షణక్షణానికీ అతని వేదన ఎక్కువై పోతోంది. భరింపరాని బాధ దిగమింగుతూ కిటికీ వూచలు పట్టుకునుంచుని చక్కటి నీలి ఆకాశంమీద అలుముకుంటున్న తెల్లటి మబ్బుల్ని పరిశీలిస్తున్నాడు.

ఈ కాలేజీ, ఈ చదువూ, ఈ అభివృద్ధీ, ఈ అభ్యున్నతీ—ఇవన్నీ ఎందుకు? ఎవరికోసం? ఇంకా కొన్నిగంటలు గడిస్తే లీలకీ తనకీ మధ్య హిమాలయాలు నుంచుంటాయి;

ఆమె జానులు అల్లరిచేస్తాయి; నయాగరాలు హోరుమం
టాయి; సహారాలు భయపెడ్తాయి. సాఘిక దృష్టిలో ఆమె,
తనూ చాలా దూరమైపోతారు. పూర్వ ప్రణయాన్ని పుర
స్కరించుకుని ఆమె జీవితాంతం వరకూ తనమీద కొంత
అనురాగమూ, అభిమానమూ చూపవచ్చు. చూపితే
మాత్రం? దాన్లో యిద్దరికీ తృప్తివుండదు. పవిత్రత కని
పించదు. నిజమయిన సౌఖ్యం కలగదు. ఆ అభిమాన
మయినా ఒకమాదిరి కుట్రే అవుతుందేమో కూడాను!

వివాహం అయిపోయిన తర్వాత తమ యిద్దరి బాంధ
వ్యమూ, తమ యిద్దరి మధ్యా వుండే అన్యోన్యతా
పూర్తిగా ఆమె భర్త స్వభావంమీద ఆధారపడి వుంటాయి.
భర్త ఎంత యోగ్యుడయినా, ఎంతవిశాల హృదయుడయినా,
ఎంత వున్నతశీలియయినా, తమిద్దరమూ ఒకప్పుడు ప్రణయ
బాంధవులమని తెలిసినతర్వాత అయినా అసూయ చూపక
పోతాడా ?

లీల వివాహం ఆపేందుకు మార్గంవుందా ? అవుతాడు.
ఆపి ?

ఆ పైన అంతా అయోమయం. తనామెని పెళ్ళిచేసు
కునేందుకు సిద్ధంగావుంటే, ఆపడ మేమిటి, వారే ఆగుతారే!

విశ్వాంతంప్రి పేరుమోసిన వకీలూ, కూడబెట్టిన భాగ్య
వంతుడూను. అతనికి మాణిక్యాంబ గారి సంబంధం సుత
రామూ నచ్చలేదు. తల్లి బతికివుంటే ఆమె ఏమనివుండేదో!

కొద్దిపాటి సానుభూతి అయిన ఆమె చూపకుండా వుండ గలిగేదా ?

విశ్వం తనగదిలో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. మెదడులో ఆలోచనలు—జాలి గొలిపేవీ, బాధపెట్టేవి—ఝరీ వేగంతో పరుగులెత్తుతున్నాయి.

ఈ ఒక్క విషయంలో తప్ప మిగతా అన్ని విషయాల లోనూ ఎంతో ఆదరంతో చూస్తున్న తండ్రిమాట తోసేసి, లీలని తనదిగా చేసుకునేందుకు ప్రయత్నించి, ఆ కార్యంలో సఫలత పొందగలిగితే మాత్రం తన మొహం ఎవరు చూస్తారు? ధనం. ధనబలం. ధనబలంముందు ఈ ప్రపంచమంతా జోహారు చేస్తోంది. మనుష్యులశక్తి సామర్థ్యాలు వారి ధన సంపాదనని అనుసరించి వుంటాయని కొందరి నిర్ణయం కూడాను !

తెలుసు. విశ్వానికి అనుభవించకుండానే తెలుసు—తన చేతిలో పైసా లేకపోతే లీలకిగానీ, తనకిగానీ ఎట్టి సౌఖ్యమూ లభించదని.

సినీమాలలో వినే ప్రేమ పాటలు పాడుకుంటూ బతకడం ఈ నవయుగ ప్రేమికులకి దుర్లభమని అతనికి తెలుసు. అలాటి చిత్రాలు ఆదర్శదాయకాలనే మిషతో వివేకంలేని మందలకి చూపి, డబ్బు దోచుకునే ప్రొడ్యూసర్ల కంటె విశ్వం తెలివయిన వాడే !

లీలమీద అతనికి వున్న అనురాగం యేమాత్రం సంశయించవలసినది కాకపోయినా, లీలని ప్రస్తుత పరిస్థితుల్లో పెళ్ళిచేసుకుంటే పెద్దవయస్సులోవున్న తండ్రిని నొప్పించడమూ, నొప్పించినా తను కష్టాలకి గురిఅవక తప్పక పోవడమూ, యింకా క్లిష్టసమస్యలు రావడమూ జరుగుతాయి.

నిర్మలమయిన ప్రణయం ధనాభావానికి దాసోహం చెయ్యవలసిందేనా !.........ఇంకా ఆలోచిస్తున్నాడు.

నాలుగూపదిఅయింది. ఎవరో తలుపుతట్టినశబ్దం.

పూర్వపు కవళికని పోగొట్టుకుంటున్న మొహాన్ని ఒక్క అద్దం చూసుకుని, తువ్వాలుతో మొహం తుడుచుకుంటూ తలుపు తెరవడానికి వెళ్ళాడు విశ్వం.

ఒక ఉత్తరం చేతిలో పుచ్చుకుని మురళి లోపలికి వచ్చాడు.

"కాలేజీ అడ్రసుకి వచ్చింది"

ఆత్రంతో వుత్తరం లాక్కున్నాడు విశ్వం. దస్తూరి గుర్తిస్తున్నాడు. చేతులు కొద్దిగా వణికాయి.

"లీల లా వుందే!" అన్నాడు విశ్వం.

"అవును. ఆమె దస్తూరే!"

లోపల ఏం విషయాలున్నాయో అని విశ్వానికి ఖంగారుగా వుంది. మురళి—టెన్నిస్‌కి పోవాలని నాకుచెప్తూ—వెంటనే వెళ్ళిపోయాడు.

## లేఖ

కృష్ణనగరం

విశ్వా,

కొంత కాలానికి పూర్వం ప్రకృతిలోని కొన్ని శక్తులు మనిద్దర్నీ దయదలచి, జోలపాడితే నిద్రపోయే పాపలలా ఆడుకోమని, ఇద్దరి మధ్యా ప్రణయ బీజాలు నాటాయి. ఈ నాడు శక్తులు మనం ఎప్పుడూ బాల్యచాపల్యంలో మునిగి వుండడం భావ్యం కాదనో, డిజపాయింట్ మెంటు అనేది అనుభవించకపోతే జీవితంలో రసం వుండదనో నాకూ నీకూ అర్థంకాని మరింకే కారణం వల్లనో, మనిద్దరి మధ్యా ఎడబాపులు కల్పించడానికి సంకల్పించాయి.

నాకు కొన్ని గంటలలో పెళ్ళి అయిపోతుంది. ఇష్టపడి చేసుకుంటున్నానని స్వప్నంలో కూడా అనుకోకు,—గత్యం తరం లేక.

నా కోసం నువ్వు నీ జీవితాన్నంతా దుర్భరంగా చేసుకోవడం సహించలేను, వొప్పుకోను.

మన మధుర హృదయాలలో దాంపత్యధర్మాల్ని మించిన పవిత్రత వుంది. తమస్సుని నాశనం చేసే కాంతిపుంజాలున్నాయి.

దిగులు పడకు. నే నేదో దూరమై పోతున్నానని భావించకు. నిన్ను కష్టపెట్టి దూరమవను; అవసరమయితే, యిష్టంతోనే దూరమవుతాను.

చూస్తు, విశ్వం. ఒకసారి చూడు, నా వంక—నీ కంటె ఎక్కువయినవాళ్ళు నాకెవరున్నారు ?... టేబుల్ మీది ఫొటో నవ్వుతోంది... భ్రాంతి, ఇదంతా భ్రాంతా ? 'మిథ్య' అంటారు కాబోలు దీన్నే వేదాంతులు.

ఇల్యూజన్. ఆ యిల్యూజన్ ఎంత మధురంగా వుందీ; హృదయానికి ఎంతహాయి నిస్తోందీ!! అందుచేత ఆ ఇల్యూజన్‌లోనే బతికాలని నా వాంఛ ఎవడు చెప్పాడు గుండెలు పగలదీస్తున్న ఈబాధంతా ఇల్యూజన్ అని? జీవితంలో, మన విషయగ్న్యానం మానవులకి సంబంధించి వున్నదయినంత వరకూ, ఇల్యూజన్సు ఏమీ లేవు. అన్నీ నిజాలే. కరుడుగట్టిన నిజాలు. జీవితం బయటనుంచి ఈ మానవజీవితాన్ని విలోకించగలిగితే (?) ఇదంతా ఇల్యూజన్ అవవచ్చుకాని, ఇప్పుడు నేను పడుతున్న బాధంతా భ్రాంతి అని ఎలా సరిపెట్టుకునేది ?

బహుశా వేదాంతంలోని పరమార్థం బాధపడుతున్న హృదయాల్ని వోదార్చడమేనేమో! కర్మ అన్నా, పూర్వజన్మ ఫలితంఅన్నా, ప్రారబ్ధంఅన్నా తపించిపో యేగుండెలకి ఉపశాంతి కలగజేసేందుకు చేసేప్రయత్నమేనేమో!!

ఇంతవరకూ నీ ఫొటోవున్న స్థలంలో ఎల్లుండి నుంచీ ఇంకోరిఫొటో వుంటుంది. ఫొటో నయితే టేబుల్ మీంచ

వుంచుతాను గాని, హృదయంలో ఎలా ప్రతిష్ఠించుకో గలను???

సర్వదా నీ సౌఖ్యంకోరే
లీల

విశ్వం మున్నూరు పఠించాడా లేఖ.

## 5

చి|| సౌ|| లీలావతిని, చి|| ముకుందరావుకి ఇచ్చి రమణయ్యపంతులుగారి స్వగృహమున పెద్దల ఆశీర్వాదాలతో వివాహమహోత్సవం జరిపించడమయినది.

## 6

వివాహమై నెల తిరక్కుండానే లీలావతి తన భర్తతో మద్రాసు వెళ్ళిపోయింది. మామయ్య వాగ్దత్తం చేసిన వసతు లన్నిటిలోను చిక్కుకుని వుక్కిరి బిక్కిరి అయింది. దాంపత్య జీవనంలో మొదటి నాలుగు నెలలూ క్షేమ్మగా గడిచిపోయినై.

నాలుగు నెలలలోనూకూడా అప్పుడప్పుడు లీలకి విశ్వం విషయం జ్ఞప్తికి వస్తూ వుండేది. కాని ఆలోచనలన్నీ హృదయకుహరంలో ఏ మారుమూలలనో పాతిపెట్టేది.

సిటీలో సహజంగా వుండే కదలికలో, సిటీ కొత్తవారికి మొదటిరోజులలో యిర్వగలిగే నూతనోత్సాహంలో, ఆ మోజులో, లీల విశ్వాన్ని తాత్కాలికంగా మర్చిపో గలిగింది.

అదీకాక, లీల కాపరానికి వచ్చిన తర్వాత విశ్వానికి రెండు వుత్తరాలురాసింది. రెండింటికీ అతను జవాబు రాయ లేదు. అన్నగారు కూడ విశ్వం ప్రసక్తి వుత్తరాలలో రాయ డంలేదు. అందుచేత, తను ఏ ఉద్వేగంలో విశ్వాన్ని మర్చిపో గలుగుతోందో, ఆమాదిరిగానే అతడు కూడా మర్చిపోయేందుకు ప్రయత్నం చేస్తున్నాడనీ మర్చిపోగలడనీ లీల భావించింది.

మొదటినెలలో భర్తఅంటే ఎంతో అణకువతోనూ, వినయ విధేయతలతోనూ మసిలేది. ఒక్కొక్కప్పుడు అతని విశ్వాసాన్ని సంపాయించేందుకు దొంగవినయాన్ని కూడా కనబరిచేది.

ఒకరోజున సినిమాకి వెళ్ళబోతూ వుండగా లీల ముకుంద రావుని అడిగింది.

"ఏం చీరె కట్టుకోనండి ?"

"నీ యిష్టం."

"మీ కేచీరె బావుంటుందో చెప్పండి. ఆ చీరె కట్టు కుంటాను."

"నీ మనస్సుకి ఏదినచ్చితే అది కట్టుకో."

"అలా కాదండీ, నేను ఏ రకం చీరకట్టుకుంటే, మీాకు బాగుంటుందో......"

"చీరెలతో సంతోషపెడ్దామని ప్రయత్నంచేసే ఆడవాళ్ళంటే నాకు చీకాకు. ఇంకెప్పుడూ నన్నిలాటి వెర్రివిషయాలు అడక్కు., నేను సూటు నీకోసం వేసుకోవడంలేదు; నువ్వు చీరె నాకోసం కట్టుకోవడంలేదు."

లీల మనస్సు చివుక్కుమంది. కాని, భర్త చెప్పిన మాటలలోని నిజం గ్రహించింది

స్వల్ప కాలంలోనే ఒకరి స్వభావంలో వుండే లోతుపాతులు యింకోరు తెలుసుకో గలిగారు.

ముకుందరావు పదకొండింటికి ఆఫీసుకి వెళ్ళేవాడు. సాయింత్రం అయిదు గంటలదాకా వచ్చేవాడుకాడు. అంతవరకూ ఏవో పత్రికలూ, పుస్తకాలూ చదువుతూ, బజార్లవెంబడి షికార్లుకొడుతూ స్నేహితుల్ని టీకి పిలుస్తూ, స్నేహితు లింటికి టీకి వెళ్తూ కాలం ప్రొద్దు పుచ్చేది లీల. సాయింత్రం అతనురాగానే ఏ బీచికో, సినీమాకో, విందుకో యిద్దరూకలిసి ఏవో Dry Subjects గురించి మాట్లాడుకుంటూ వెళ్ళేవారు.

ఈ కార్యక్రమం మొదటిరోజులలో చాలా యింపుగానే కనిపించేది లీలకి. రానురాను దానిలో నిస్సారత తోచనారంభించింది.

కొత్తలోవున్న హుషారు హరించిపోయింది; ఉత్సాహం నశించిపోయింది. మొదటిరోజులలో రబ్బరు బంతిలా గెంతేది.

ఆమె కప్పుడు జగమంతా ప్రణయోత్సవ మనిపించేది. ఇప్పుడు ?—అది ప్రణయోత్సవమూ కాదు; భయంకర దావానలమూ కాదు—మరోటి, అనిపిస్తోంది. ఈ రెండూ కాని యింకోటి. సుఖమూ దుఃఖమూ కాని వేరొకటి. ఏమిటది ? ఆ అన్వేషణే ఆమె మానసిక బాధకి తావు తీసింది.

మొదటిరోజులలో లీల లేడీస్ క్లబ్బులో లెక్చర్లు దంచేది. రాజకీయాలు ఘాటుగా మాట్లాడేది. అర్థంలేని సమాజ నియమాల్ని తీవ్రంగా ఖండించేది.

క్లబ్బులో ఒకరోజున జరిగిన సంభాషణ.

"ప్రేమకోసం ఏమయినా త్యాగం చెయ్యాలి. ప్రేమించిన వానికోసం జీవితం ధారపోసినా దానిలో ఆనందం వుంటుంది," అంది లీల

లేడీస్ క్లబ్బు సెక్రటరీ సుశీలాదేవి, గురువు తనశిష్యుని అజ్ఞానాన్ని తెలుసుకొని నవ్వినట్లుగా జాలిగా నవ్వింది.

"ఏమండీ, నేను చెప్పినది సబబుగా లేదనా మీరు నవ్వుతున్నారు ?" లీలావతి అడిగింది.

"మీరు చాలా చిన్నవారు. జీవితంలో మీకు చెప్పుకోదగినంత అనుభవం వుందని అనుకోను. ఇలాటి చక్కని ఆదర్శాల గురించి అందంగా మాట్లాడ గలగడం....—" సుశీలాదేవి విజ్ఞప్తి యింకా పూర్తికాలేదు.

"ఒక ఆదర్శానికి కట్టుబడని జీవితం హేయమయినది కాదండీ ?"

ఒక్క ఆదర్శమేమిటెలెండి, జీవితానికి చాల ఆదర్శాలు కావాలి.........మీరు—ప్రేమించిన వారికోసం జీవితం త్యాగం చెయ్యమంటారూ ?...కోప్పడకండి. మనలో మన మాటా......మీరు ఎప్పుడయినా ఎవర్నయినా ప్రేమించారూ ?''

అవుననడమా కాదనడమా అని తట పటా యిస్తూ యిటూ అటూ దిక్కులు చూసింది లీలావతి.

''బిడియపడకండి. జంకవలసిన అవసర మేమిటి ?'' అంది సుశీలా దేవి.

''ఊఁ,'' అంటూ, లీలావతి తల పంకించింది ?''

''మీారతనికోసం యేంత్యాగం చేశారండీ!''

లీలావతి తెల్లబోయింది. జవాబు లేదు. జవాబు చెప్ప లేక పోయింది. ఒక్కసారి విశ్వం ప్రత్యక్షమయి, లీలా, జ్ఞాపకం వున్నానా ? సుశీలా దేవి ప్రశ్నకి ఏం జవాబు చెప్తావ్ ? నువ్వుకూడా మాట్లాట్టం కోసం మాట్లాడుతున్నా వేమిటి ?'' అంటున్నట్లుగా తోచింది.

సుశీలా దేవికి తెలుసు—తన ప్రశ్నకి జవాబు వుండ దని. అంత చక్కటిపిల్ల ఆదర్శజీవితానికీ నిజ జీవితానికీ మధ్యనివున్న సముద్రాల లోతు తెలుసుకోలేక, యిలా వెర్రిగా అంధకారంలో చిందులు తొక్కడం ఆమెకి మన స్కరించలేదు. నిజాన్ని చూపింది. మిరుమిట్లు గొలిపే కళ్ళతో చూసింది లీల.

ఆకాశం అంతా తనదే అనీ తన ఆనందంకోసమే అనీ భ్రమిస్తూ గంతులేస్తే పిట్ట గూడుమాత్రమే తన స్థానమనీ మిగతాది తనది కాదనీ తెలుసుకుంది.

## 7

"సుశీలా దేవీ, నాకు వారం పదిరోజుల్నుంచీ మనస్సులో ఏదో దిగులుగా వుంటోంది. యేపని లోనూ ఉత్సాహమూ, చురుకూ చూపించ లేకుండా వున్నాను. కారణం తెలీకుండావుంది."

"వెతుకు. కనిపించకపోదు."

సుశీలా దేవి చెప్పినమాటలు లీలసరిగ్గా వినిపించుకోలేదు. దూరపు మబ్బులవెనుక దాగుడుమూతలు ఆడుతున్న నిజ కారణం లీలకి స్ఫురించకపోదు.

"యేం వెతికేది! యేంవుంది! వెతకడానికి? ఒక్క మారు మామామయ్యనీ, అమ్మనీ చూచివస్తే ఈ బెంగ కాస్త వదలుతుందేమో!"

వెళ్ళిరమ్మని సుశీలా దేవి సలహా.

మర్నాడురాత్రి లీలావతిని సుశీలా దేవీ ముకుందరావూ మెయిల్‌లో ఎక్కించారు.

## 8

రైలుస్టేషన్ దగ్గిరికి రవణయ్యపంతులు ఒక్కడే వచ్చాడు. మురళిరాలేదు.

పెట్టెలోనుంచి దిగీ దిగ్గానే లీలావతి అడిగింది. "మామయ్యా, అన్నయ్య సెలవులకి రాలేదూ ?"

"వచ్చాడు."

"మరి, స్టేషన్‌కి రాలేదేం !"

"ఏమో ! ఏదో చదువుకుంటున్నాడు."

"ఊఁ," అన్నాడు రవణయ్య. ఇద్దరూ జట్కాలో యింటికి వెళ్ళారు. దారి పొడుగునా రవణయ్య పంతులు లీలని ఆమె కొత్త కాపురమూ, ముకుందరావు స్వభావమూ, ఆమె పరిచయులూ, తత్సంబంధమైన కుశల ప్రశ్నలు వేస్తూనే వున్నాడు. లీల అన్నిటికీ జవాబు చెప్తూనే వుంది.

రైలు దిగినప్పట్నించీ, ఆ పాతవూరూ, ఆ పాత వీధులూ, ఆ పాత యిళ్ళూ, ఆ పాత మొహాలూ పరిశీలిస్తున్న లీలకి యేవో మధుర భావాలు స్మృతిపథంలో దొర్లిపోనారంభించాయి. ఉత్సాహం ఆమె మనస్సులో పూటలూగుతోంది. అంతకి క్రితం వారం పదిరోజుల్నించీ పడుతున్న బాధ నిమేషమాత్రంలో తుత్రున పారిపోయినట్లు తోసింది.

బండి వారి వీధిలోకి వచ్చింది. ఆమె సంతోషం మరింత ఎక్కువ అయింది. చక్కటి సంఘటనలు—ఎప్పుడో గడచిపోయినవీ; యింక జీవితంలో తలుచుకోకూడనివీ—జ్ఞప్తికి వచ్చినై, తను యేవి మర్చిపోవాలనే దృఢసంకల్పంతో వుందో అవి, వాటంతటవే, కళ్ళకి కట్టినట్లు, కన్పించడం లీలకి తియ్యటి బాధ కలిగించింది.

బండి ఆగింది. మొట్టమొదట రవణయ్య పంతులు దిగాడు. వెనకనే లీలావతి. వారి రాకని నిరీక్షిస్తూ వీధి గుమ్మంలో నుంచున్న మాణిక్యాంబ, లీల గుమ్మంలో అడుగు పెట్టీ పెట్టగానే 'వచ్చావా, తల్లీ !' అంటూ కూతుర్ని కౌగలించుకుంది. వీధివైపు గదిలో కూచుని 'The Fate of Homo Sapiens' చదువుతున్న మురళి చెల్లెల్ని చూడ్డానికి పుస్తకంతో సహా వీధిలోనికి వచ్చాడు

"నీ కోసం రెండు మూడు రోజులలో మురళిని పంపిద్దామనుకుంటున్నామమ్మా; నువ్వే వచ్చావ్ ! చాలా సంతోషంగా వుంది," అంది మాణిక్యాంబ.

మురళి వంక చూసింది లీలావతి—అవునన్నట్లు తల వూపాడతను, 'కాని వాడు మాత్రం అంటూనే వున్నాడు—చూడండీ, లీల రెండు మూడు రోజులలో వస్తుంది—అని, 'వస్తానని నీ కేమయినా ఉత్తరం రాసిందా ?' అంటే, 'లేదు, చూడండీ, వస్తుంది,' అనేవాడు,' మాణిక్యాంబ.

"ఏం, అన్నయ్యా, నేను వస్తానని నీ కెలా తెలుసు ?"

"ఊహించాను."

"ఎలా వూహించావ్ ?"

"ఎలా గేమిటి ? ఎలాగో అలా ! వచ్చావా, లేదా ?"

"మధ్యాహ్నం కావలసినన్ని కబుర్లు చెప్పుకోవచ్చు. చూడు, మాణిక్యం, రాత్రి అమ్మాయికి రైలు ప్రయాణంలో ఏమీ నిద్రపట్టివుండదు. త్వరగా బియ్యం పొయ్యిమీద

పడేస్తే, నాలుగు మెతుకులు తిని, కాసేపు కునుకుపోతుంది. ఈ లోగా కాస్త కాఫీ కలిపి యియ్యి." అంటూ రవణయ్య పంతులు సావిట్లో వున్న 'హిందూ' పత్రిక చేతిలో పుచ్చుకుని, మేడ మెట్లు ఎక్కాడు.

పదకొండుగంటలయ్యేటప్పటికి భోజనం అయింది. యీ లోగా తల్లి తను ఆవూళ్ళో లేనప్పుడు జరిగిన జనన మరణాలూ, పెళ్ళిళ్ళూ చెప్పింది. రవణయ్య పంతులు రష్యన్ రాజనీతి గురించీ, హిందూదేశపు భవితవ్యంగురించీ చిన్న లెక్చరిచ్చాడు. మురళి ఒకే ధ్యాసలో వున్నాడు చదువు ......చదువు...ఎందుకో ఆ చదువు ?...

కాని, ఒక్కరూ విశ్వంగురించి మాటాడరేం !! అతను యేమయిపోయాడు ? అతని విషయం ఎవరికీ అక్కర్లేదూ ! తనకి అతనికంటె సామ్యవాద సిద్ధాంతాలూ, జనన మరణాలూ ఎక్కువ అవసర మయినవని అనుకుంటున్నారా? యే ఒక్కరూ విశ్వం ప్రసక్తి తీసుకు రాకపోవడంవల్ల వారు ముగ్గురూ యేకీభవించి యేదోకుట్ర పన్నుతున్నట్లుగా ఫీలయింది లీలావతి.

ప్రయాణ బడలికవల్ల, కడుపులో చల్లబడగానే కళ్ళ మీదికి కునుకు వచ్చింది. మూడింటికి, టీ వేళకి, లీలావతి కళ్ళు తెరిపికి వచ్చాయి.

# 9

లీలావతి నిద్రనుంచి లేచే సమయానికి మాణిక్యాంబ కుంపటిమీద టీకి నీళ్ళు పెట్టివుంచింది. లీలే టీ కలిపి మొట్ట మొదట మామయ్యకీ, తర్వాత అన్నయ్యకీ అందజేసింది.

ఆమె టీ టేబుల్ మీద వుంచుతూవుండగా, పుస్తక పఠనలో మునిగివున్న మురళి తెప్పరిల్లి అడిగాడు.

"నువ్వు పుచ్చుకున్నావా?"

లీల జవాబు; "ఇంకా లేదు."

"నువ్వుకూడా యిక్కడికి తెచ్చుకో. ఇద్దరమూ కబుర్లు చెప్పుకుంటూ పుచ్చుకోవచ్చు."

"ఆ పుస్తకం చదవడం పూర్తిఅయిందా?"

"ఆ, ఆ, చాలా చక్కగా వుంది."

"నీకు పుస్తకాలంటే అంత వెర్రివ్యామోహ మేమిటి? అంత దీక్షగా—ఒకగంట అయినా విశ్రాంతి లేకుండా—చదివితే, తలనొప్పి రాదూ?"

మురళి నవ్వుతూ, 'రాదులే, చదవక పోతేనే చీకాకుగా వుంటుంది.'

"ఇదొక అలవాటు. ఈ అలవాటు యింకొకరికి బాధకలిగించనిదీ, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడేదీను. టీ తెచ్చుకో," అంటూ మళ్ళీ జ్ఞాపకం చేశాడు.

లీలావతి టీ తెచ్చుకువచ్చి, పేము కుర్చీలో ఆసీనురాలయింది. మురళిఎదురుగా వాలుకుర్చీలో పడుకున్నాడు.

మురళి సంభాషణ మొదలెట్టాడు 'పొద్దుట్నుంచి ఈ పుస్తకం పూర్తి అయేదాకా యితర పనులేవీ చెయ్యకూడద దను పట్టుదలతో చదువు తున్నాను'

"ఊఁ...పూర్తిఅ యింది కాదూ!" అన్నగారికి వున్న చదువుపిచ్చిని వెటకారం చేస్తున్నట్లుగా అంది.

"ఊఁ, అయింది...బావ ఖులాసాగా వుంటున్నారా?"

"ఇప్పుడు జ్ఞాపకం వచ్చారా? నేను వుదయం ఎనిమిది గంటలకి వచ్చాను. ఇప్పుడా క్షేమసమాచారం కనుక్కో వడం?"

"ముందే చెప్తున్నాను కాదూ కుమార్వణ—బావ స్వభావం ఎలాటిది?"

"చాలా మంచివారు"

"నీకు పెళ్ళి చేసిందా,—అంతటితో వూరుకోక, నన్ను కూడా పెళ్ళిచేసుకోమని పీడించుకు తింటోందేమిటి అమ్మ! పెద్దవాళ్ళకి పెళ్ళిళ్ళు చెయ్యడమూ, పిల్లలుకష్టా లనుభవిస్తూ వుంటే చూడడమూ సరదా యేమో!"

"చేసుకుందూ! ఎప్పుడయితేనేం! ఎప్పుడో ఒకప్పుడు ఎవర్తెనో ఒకదాన్ని కట్టుకోవాలి కదా! అమ్మ కోడల్ని తెచ్చుకోవాలని ఎంత ముచ్చటపడుతోందో!"

అప్పుడే, ఆరు నెలలయినా గడవకుండానే, లీలావతిలో ప్రమాద కరమయిన నీరసధోరణి! రాజీధోరణి. మూడు ముళ్ళల్లోనూవుండే మహాత్మ్యం!!

"అలా కాదు. కానేరదు. అమ్మ కోసం గానీ యితరుల కోసం గానీ నేను పెళ్ళి చేసుకోను. నా హృదయం ఎవరి కోసం ఉత్సాహంతో ఉవ్విళ్ళూరుతుందో వారిని ప్రేమించి, పెళ్ళిచేసుకుంటాను."

'ఏ దేశంలోఅయినా, యేకాలంలో అయినా, చరిత్రకి తెలిసినంతటిలో ఆ మాదిరి వివాహం ఒక్కటయినా జరిగిందా!' అన్నంత అపనమ్మకంతో "ఊ—అలాగే కానీ—చూస్తానుకాదూ!" అంది లీల, చిరునవ్వుతో.

మురళి 'ప్రేమించి—పెళ్ళి చేసుకోవడం' గురించి చెల్లెలికి ఒకగంట లెక్చరివ్వగలడు. కాని, ఆమెలో వినేందుకు వోపిక లేదు. విశ్వం గురించి విషయాలు తెలుసుకోవాలని ఆమెకి ఎంతో కుతూహలంగా వుంది. తనంతట తనుఅతని ప్రసక్తి తీసుకు రావడం ఆమెకి అపసవ్యంగా తోచింది, కాని, వుండలేక, ఆత్రాన్ని పట్టలేక, తెగించి అడిగింది.

"విశ్వానికి రెండు ఉత్తరాలు రాస్తే, ఒక్కదానికీ జవాబు రాయలేదే?"

ప్రశ్న వేసి అతని ముఖకవళికని జాగ్రత్తగా పరిశీలించింది.

"ఒక ఉత్తరం వచ్చిందని నాతో చెప్పాడు. రెండో ఉత్తరం సంగతి చెప్పలేదు"

"జవాబు రాశావా—అని అడిగావా?"

"అడిగాను. 'యేం రాసేది!' అన్నాడు."

లీల తొట్రుపాటుతో అడిగింది. 'మునుపటిలా సరదాగా వుంటున్నాడా?'' 'ఎలా వుండగలను. నీ భ్రాంతి గాని!' అని ఏదో చీకటి మూలనుంచి ఒక అరుపు వినిపిస్తూనే వుంది.

''ఏదో వుంటున్నాడు,'' అన్నాడు మురళి, ఆ విష యాలు మాట్లాట్టం అంత యిష్టంలేని వాడిలా.

లీల యింక ఏమడగనా అని ఆలోచిస్తోంది. ''నాతో పూర్వం వున్నట్టుగా వుండడంలేదు. పరిచయం తగ్గించే శాడు,'' అన్నాడు మురళి.

''సెలవులకి ఊవూరు వచ్చాడా?''

''రాలేదు''

''నేను వస్తానని తెలీదూ?''

''తెలుసు. అందుచేతనే రాలేదు''

ఇంక లీలావతి మాట్లాడలేకపోయింది. అన్నయ్య తన నుంచి ఎన్నో విషయాలు దాస్తున్నాడని గ్రహించుకుంది. కుర్చీలోనుంచి లేచింది. కాళ్ళు తడబడ్డాయి. గదిలోనుంచి సావిట్లోకివచ్చింది. తలది మ్మెక్కిపోయింది.

మేడమెట్లు దిగుతూ రమణయ్యపంతులు అన్నాడు. ''అమ్మాయీ, విశ్వం మొన్న హైదరాబాదులో కనిపిం చాడు. లీల క్షేమ సమాచారం తెలుస్తోందా అనినన్ను వాకబుచేశాడు—సెలవులకి ఊవూరు రాడట—'

లీలావతికి యేమీతోచలేదు. కాలమూ, జీవితమూ, భవిష్యత్తూ అర్థహీనంగా కనిపించినై.

భయమేసింది. దొడ్లో దానిమ్మచెట్టు నీడలో, అకార ణంగా ఆకులు తెంపుతూ నుంచుంది.

అంట్లు తోమే మనిషి, "అమ్మాయిగారూ, ఎప్పు డొచ్చారు?" అని అడిగింది.

"ఇవ్వాళ ఉదయం," అని చీకాకుతో అంటూ, అక్క ణ్నుంచి వంట వసారాలోకి పరుగెత్తింది.

తల్లి రాత్రివంటకి బియ్యం కొలుచుకుంటోంది, ఇంతలో మురళి రేడియో ట్యూన్ చేశాడు.

లీలావతి వసారా తలుపుకి ఆనుకుని వింటోంది. ప్రేమలో నువ్వెంత బాధ పడగలిగితే, అంత ఆనందం నీకు లభ్యమవు తుంది'—అని ప్రబోధిస్తూ పాడుతున్న ఆ రేడియో పాట కుని ప్రేమగానం ఆమె మనస్సులో అంటుకున్న దావా నలాన్ని కొంతవరకూ ఆర్పగలిగింది.

# 10

అన్నగారి సెలవులు అయిపోయేదాకా—అంటే వేసంగి అంతా ఖులాసాగా కాలక్షేపం చేదామనుకుని వచ్చిన లీలా వతికి వారంరోజులు వుండడం కష్టసాధ్యమయింది. మద్రా సులో శాంతి లేక యిక్కడికి వచ్చింది. ఆ శాంతి యిక్కడా లభ్యం కాలేదు.

ఈ శాంతీ, అశాంతీ ప్రదేశాలలో లేను. ఆమె మన
స్సులో వుంది హృదయంలోని ఒక మూల మూలనుంచి
అంతర్వాణి గంభీరంగా పలుకుతోంది.

'ఎక్కడికి అలా పరుగెడ్తావ్? నీకు శాంతి లేదు. నువ్వే
ఒకటి నమ్మావు పరిస్థితులకి బానిసవి అయిపోయి యింకోటి
చేశావు. శాంతి ఎలా వస్తుందనుకున్నావ్. యావజ్జీవం
నువ్వు ఈ మాదిరి అసంతృప్తి జీవనాన్ని గడపవలసిందే!...
ధైర్యం వుందా ఒక్కటే మార్గం. ఈ నియమాలన్నీ నీట
గలుపు. ఈ బంధాలన్నీ పెకలించుకొని బయటికిరా. నీ
ఆత్మే నీకు సాక్షి. అహంభావాన్ని వదలి నీ అసహాయతనీ,
అశాంతినీ విశ్వానికి విన్నవించు.........'

Vanity. ప్రతి వ్యక్తిలోనూ ఏదో ఒక రూపంలో తప్పక
కనిపించే Vanity ఆమెని ఆవరించింది. తను యిన్ని వది
లేసుకుని, యిన్ని చేతులారా త్యజించేసి, తన్ను మర్చిపోదా
మనే నిరంతర సాధనలో వున్న విశ్వానికి ఆహుతి అయి
పోవడం ఆమె Vanity ని బాధ పెట్టింది.

విశ్వం చేస్తున్న సాధన ఎందుకు? ఆమె తన్ను మర్చి
పోవాలనీ, మర్చిపోతేగాని ఆమె జీవితసౌఖ్యంలోని లోతు
చూడలేదనీ, ఆమె కాపరం చీకూ చింతా లేకుండా మంగళ
ప్రదంగా సాగదనీను. లీలావతిమట్టుకు అతని ప్రవర్తనని
ఆదృష్టితో చూడలేకపోయింది. తన్ను మర్చిపోవాలని
ప్రయత్నించడం అనాదరించడంగా భావించి పొరబడింది.

ఆమెకి భరించలేనంత బాధ పొంగి పొర్లి వస్తోంది. ఎవ రితోనయినా చెప్పుకుంటేగాని ఆవేదన తగ్గదు; గుండెలకి చల్లదనం కలగదు. విశ్వం చూపిస్తున్న అనాదరణ, తన హృదయంలో మండుతున్న అగ్నిగుండం, ధనమూ దాంపత్య జీవనమూ తనకి యివ్వగలిగిన తీరని అశాంతి...తన యిన్ని బాధలూ ఆకర్షించి సానుభూతి చూపించ గలిగిన వారెవ రితో నయినా చెప్పుకోవాలి. ఇతరుల సానుభూతి గాయాన్ని మాన్పలేదుగాని బాధని కొంతవరకూ వుపశ మింప జేస్తుంది.

ఎవరు బతిమాలినా వినక, తిథితిరక్కుండా లీలావతి మద్రాసుకి ప్రయాణ మయింది. సాయంత్రం అయిదున్నర అవుతోంది. బండి ఎక్కుతూ వుండగా తల్లి అడిగింది, 'అమ్మాయీ, మళ్ళీ ఎప్పుడు వస్తావ్ ?' అని.

"ఏమో !"

ఆమె వెళ్ళే సమయానికి మురళి యింట్లో లేడు. రామ య్య పంతులు రైలు ఎక్కించడానికి స్టేషనుకి వెళ్ళాడు.

రైలు ఎక్కించి పంతులు అన్నాడు, 'అమ్మాయీ! దిగులుపడి ప్రయోజనం లేదు. మన జీవిత బాట లన్నీ ఎప్పుడో నిర్ణయమైపోయి వున్నాయి. మనం వుట్టి అశక్తులం. పుస్తకంలోని పేజీలు చదవడం అయిపోగానే తిరగేస్తాం— అలాగే జీవితంలోని రోజులూను. ఒక ప్రకరణం అవగానే కాసేపు ఆలోచిస్తాం—ఇంతకి పూర్వం గడచిన ప్రకరణాలని

అనుసరించి గత ప్రకరణంలో ఏం జరిగిందీ, ముందు ప్రకరణంలో ఏం రాబోతోందీ—అని. చూడు, అమ్మాయీ, ముందు ప్రకరణ కూడా అక్కడ రాసే వుంది. ఏటొచ్చీ మనం చదవడమే ఆలస్యం......బహుశా, యివన్నీ నీకు మధ్య వయస్సులోని మనుష్యులు చెప్పే నీతివాక్యాలలా కనిపించవచ్చు......కాని, తాత్పర్యంతో ప్రపంచపు రీతి నీతులు గ్రహించి, అందుబాటులో వున్న ఆచరణీయ సిద్ధాంతాల మధ్యవయస్సులో వారే చెప్పగలరు.'

మనిద్దరమూ ఎంత దగ్గిరిగా వున్నా, దూరంగానే వున్నాం—మామా !"

"నాకు తెలుసు, లీలా, వయస్సులోని తీక్షణత అది—లోపం అనడానికి సాహసించను. ఎందుకంటే, ఆ తీక్షణతలో ఒక మధురిమవుంది. ఆ యిల్యూజన్‌లో ఒక కమ్మదనం వుంది. 'ప్రేమలూ, స్నేహాలూ, రూపాయలూ, మోసాలూ'—అవన్నీ కొంత కాలం వుండాలి. కాని, ఎక్కువ కాలం వుంటే అభ్యున్నతికి ఆటంకం ఒక్కొక్కటే పోవాలి, పోతాయి. లీలా, చిన్నతనంలో నువ్వు రైలు ఆట ఆడిన రోజులు జ్ఞప్తికి తెచ్చుకో. ఆరోజులు తలుచుకుని యిప్పుడు నవ్వుకుంటావ్. చిన్నతనంలోని ఆ ఆటలు నీ అజ్ఞానాన్ని గానీ, అవివేకాన్ని గానీ సూచించవు. అవి ఆ వయస్సులో స్వభావసిద్ధం. అలాగే, యింకోదశ గడిచినతర్వాత, యిప్పుడు నువ్వనుభవిస్తున్న అశాంతి తలుచుకొని—ఎందుకలా బాధపడ్డానా ?—అని నీలో నువ్వే నవ్వుకుంటావ్ !"

"పదిసంవత్సరాలు యింత శ్రద్ధతో బతక గలిగితే కదా!"

ఇంతలో రైలు కూసింది. కదిలింది. వెళ్ళొస్తా నంటూ మామయ్యకి నమస్కారం చేసింది లీలావతి. పంతులు అందుకున్నాడు.

రైలు భీకరధ్వని చేస్తూ అంధకారాన్ని చీల్చుకు పోతూ వుంది.

చినుకులు పడుతూవుండగా చీకటి సందులలో నుంచి యిల్లు చేరుకున్నాడు పంతులు.

## 11

లీలావతి వుదయాన్నే వచ్చిందన్న విషయం తెలుసుకుని, సుశీలాదేవి మధ్యాహ్నం వచ్చింది.

కుశల ప్రశ్నలు వేసిన తర్వాత, లీలావతిలో స్పష్టంగా గోచరిస్తున్న మార్పు గమనించి సుశీల అంది. "ఏం లీలా, పుట్టింటికి వెళ్ళి బలిసి రావడానికి బదులు చిక్కిపోయి వచ్చావేం!"

లీలావతి సమాధానం చెప్పలేదు. తన కెదురుగా గోడకి తగిలించివున్న భర్త ఎన్‌లార్జిమెంటు వంక తదేకదృష్టితో చూస్తోంది.

"అంత పరధ్యానం ఏమిటి? నేను అన్న మాటలు వినిపించాయా?"

అప్పుడే స్వప్నావస్థ నుంచి మేల్కొన్న మనిషిలా లీలా వతి అంది. 'యేమిటి ?'

"ఏమీ లేదు—ముకుందరావు గారికి తెలుసా నువ్వు వచ్చినట్లు ?"

"తెలుసు. నేను వచ్చేటప్పటికి యింటి దగ్గిరేవున్నారు."

"నిన్ను చూడగానే ఆయన ఏమీ అనలేదూ ?"

"అన్నారు."

"ఏమని ?"

"జబ్బుపడి నిమ్మళించిన మనిషిలావున్నావేమిటన్నారు."

"నువ్వేమన్నావ్ ?"

"ప్రయాణ బడలిక—అన్నాను."

"అబద్ధం కాదూ ?"

లీలావతి తల దించేసుకుంది. అవును, అబద్ధమే ! ప్రయాణబడలికవల్ల ఆమె ముఖమండలం అలా చిన్న బోలేదు. మనస్సులోవున్న దిగులే మొహం వెలిబుచ్చింది.

"లీలా, నువ్వు పసిపిల్లవి. నిన్ను మొట్టమొదట క్లబ్బులో చూచిననాడే నీ మీద ఎందుకో అవ్యాజానురాగం కలిగింది. మనం స్నేహితుల మయాం. స్నేహితులకి ఒకరి బాధలు యింకోరు తెలుసుకునేందుకూ, నివారణోపాయం సూచించేం దుకూ హక్కువుంది. ఒకర్ని గురించి యింకోరు క్షుణ్ణంగా తెలుసుకోగలగడమే నిజమయిన స్నేహానికి పునాది. నిన్ను ఏవో ఆవేదనలు కుంగదీసేస్తున్నాయని నాకెప్పుడో తెలుసు.

కాని, అవి ఏమిటో, వాటి ప్రస్తుత పరిస్థితి ఏమిటో, నువ్వే ముందు ముందు చెప్తావనే నమ్మకంతో యింతకాలం నిన్ను అడక్కుండా ప్రతీక్ష చేశాను.''

లీలావతి సుశీలాదేవి కళ్ళల్లోకి చూస్తోంది,—'నువ్వు కాక నాకింకెవరుదిక్కు?' అన్నట్లుగా.

సుశీలాదేవి అంది. 'ఆ ఆవేదనలకి దాసీవై జీర్ణించి పోతున్నావు. అది నేను చూస్తూ సహించలేను.''

' అవును. జీర్ణించిపోతున్న మాట వాస్తవమే? ఆ బాధల్ని జీర్ణం చేసుకుందామనే ఉద్దేశంలో నేనే జీర్ణించి పోతున్నాను. గత్యంతరం కనిపించడంలేదు, వేరువిధానం తోచడం లేదు.''

''ఉంది. ప్రపంచంలో లేకపోవడమనేది లేదు. అన్నీ వున్నాయి. వాటిని సంపాయించుకోవడమూ అనుభవించడమూ మనశక్తి సామర్థ్యాల్లో వుంది; మనం ప్రపంచానుభవంతో నేర్చుకున్న పాఠాల సారంలో వుంది.''

''నాకు ఏ అనుభవమూ లేదు. ఒకే అనుభవం. అదే నాజీవితాన్ని పీల్చి పిప్పిజేసి ఆరని అగ్నుల్ని నా గుండెలలో మండిస్తోంది.''

''అంత బేలతనం పనికిరాదు, లీలా, జీవితంలోని సమస్యల్ని ఎదుర్కొనేందుకు ధయిర్యమూ, ఓపికా, వివేకమూ కావాలి''

లీలావతి తన విచారాన్ని దాచుకోలేక పోయింది. ప్రేమలో ఎంత అసహాయురాలయిందో విచారాన్ని దాచుకోలేక పోవడంలోనూ అంతే అయింది. సుశీలాదేవి వోదార్చింది.

కథంతా ఆకర్ణించి సుశీలాదేవి జాలిపడింది. లీల తన గుండెల మీదనుంచి సగం బరువు దించుకున్నట్లుగా తల పోసింది.

"సుశీలా, ఈ పెళ్ళికి నేను ఒప్పుకోలేక అప్పుడే విశ్వంతో ఎక్కడికయినా దూర దేశానికి పోయి వుంటే బావుండే దేమో!"

"చెప్పలేను. అప్పుడు యింకో రకమయిన సమస్యలు వచ్చివుండేవి. నేను చెప్తున్నాను విను, సమస్యలు లేని జీవితం వాసన లేని పువ్వులాంటిది. ప్రతి జీవితానికీ ఏవో ఒక మాదిరి సమస్యలు వుంటూనే వుంటాయి అదీ కాక—'అలా జరిగివుండక, యిలా జరిగివుంటే' దృష్టితో నేను ఏ విషయాన్నీ చూడలేను. అలా జరిగింది—ఇలా జరగలేదు, అంతే; మార్గం ఏమిటి? మార్గాన్వేషణ ప్రధానం, విధి నిర్ణయంలోని పొరబాట్లు వెతకడం వొట్టి అవివేకం."

"మామయ్య జీవితంలో ఏ ఒక్క విషయాన్నీ సీరియస్‌గా తీసుకోవద్దనీ, జీవితమే దాగుడుమూత లాటిదనీ అంటాడు.

"మీ మామయ్య దృష్టి నాకు అర్థమయింది అది మన లాటివారికి వుపకరించదేమో! ఆయన విధానాలలోనూ,

దృష్టిలోనూ, సిద్ధాంతాల లోనూ గొప్ప నేర్పు వున్నట్లు కని పిస్తోంది. 'ప్చ్! ఏముంది? ఎలాగో అలా పోనిద్దూ, రోజులు గడవక పోతాయా! అనే నిర్లక్ష్యమార్గంలో జీవనశక్తిని క్షీణింప జేసే నిరసగుణంవుంది. మనసులోవున్న ఉత్సుకతని నాశనం చేస్తుం దా రాక్షశక్తి. అంచేత, ఆరకమయిన వేదాంతాన్ని నేను నిరశిస్తాను; ఆక్షేపిస్తాను; ఒప్పుకోను. 'జవానీ' లేకపోతే నాగరికతే లేదు''

''ఈ అశాంతి ఎలా పోతుంది? ''

''పోతుంది. మార్గంవుంది. కొంత కాలం వోపిక పట్టు. ''

''ఎంత కాలం''

''పరిస్థితులు అనుకూలించేటంత వరకూ. ''

''ఎప్పటి కనుకూలిస్తాయో? ''

''అలా విచారంతోనూ, దిగులుతోనూ రోజులు లెక్క పెట్టకు. OPTIMISTIC గాచూడు, ఎందు కనుకూలించవని! అనుకూలించడం అనడంలో నీ అభిప్రాయం ఏమిటో ఒక నిర్ణయానికి రా. ''

ఆమెకి ఏ అభిప్రాయమూ లేదు. తన అశాంతి కొన్ని పరిస్థితులు అనుకూలిస్తే పోతుందంటుంది సుశీలాదేవి. ఏ పరిస్థితులు, ఎలాఅనుకూలించడం? లీలావతికి దురూహ్యంగా వుంది. అయితే మామయ్య మాటలకీ, ఈమె మాటలకీ వ్యత్యాసం ఏమిటి? ఒక్కొక్కరు తనహృదయాన్ని ఒక్కొక్క మాదిరిగా లాక్కుంటున్నారు...తనకి స్వంతంగా ఏ అభి

ప్రాయమూ లేదా? భయంవేసింది. తన వ్యక్తిత్వం దెబ్బ
తింది...............

ఇద్దరూ టీత్రాగి, మాటినీకి వెళ్ళారు.

## 12

హైద్రాబాదులో పినతల్లిగారింట్లో వుంటున్నాడు విశ్వం. సాయంత్రం బాబాయితో కలిసి టెన్నిస్‌కి వెళ్ళబోతున్న సమయంలో టెలిగ్రాం వచ్చింది.

ఎక్కణ్ణించి?

కృష్ణనగరంనుంచి.

వణుకుతున్న చేతులతోవిప్పి, కంగారుతో పైకి చదివాడు టెలిగ్రాం.

మీనాన్నగారికి చాలాసుస్తీగా వుంది. తక్షణం బయలుదేరి రా.

నారాయణస్వామి. ''

నారాయణస్వామి తనతండ్రి దగ్గిర గుమాస్తా. నమ్మకమయిన మనిషి చాలా సంవత్సరాల్నుంచి అభిమానంతోనూ విశ్వాసంతోనూ పనిచేస్తున్నాడు.

ఆ రాత్రే విశ్వం బయలుదేరాడు హైద్రాబాదునుంచి;

''వెళ్ళీవెళ్ళగానే బావగారి ఆరోగ్య స్థితిని తెలియజెయ్యమ'' ని పిన్ని, ''నీ ఉత్తరం కోసం ఆతురతతో ఎదురుచూస్తూ వుంటా''మని బాబాయీ అన్నారు.

[illegible]యికి సెలవు దొరకదు కనక ఆయన అసలు ప్రయాణమే అవలేదు. పిన్ని మొదట్లో ప్రయాణం అయి, అంతా సిద్ధం చేసుకుంది కాని, చంటి పిల్లాడికి సుస్తీగా వుండటం చేత కాస్త సందేహించింది.

కృష్ణనగరం రైలుస్టేషన్‌కి విశ్వాన్ని 'రిసీవ్' చేసుకునేందుకు నారాయణస్వామీ, మురళీ వచ్చారు. పెట్టెలోనుంచి దిగగానే నారాయణస్వామిని వుద్దేశించి విశ్వం అడిగాడు. "స్వామీ, నాన్నగారికి ఎలావుంది?"

"నిన్న రాత్రి గాభరా పెట్టింది కాని ఈపూట కొంచెం నెమ్మదిగానేవుంది. డాక్టరుగారు ఫరవా లేదంటున్నారు. అయ్యగారు మీ కోసం ఒకటే పలవరింతలు నిన్నరాత్రి మెలకువ వచ్చినప్పుడల్లా 'అబ్బాయి వచ్చాడా?' అన్న ప్రశ్న తప్ప యింకోటి లేనే లేదు."

విశ్వం మురళివైపు తిరిగాడు. "ఏం, మురళీ, లీల ఖులాసాగా వుంటోందా?"

"వారం రోజులు యిక్కడవుండి, మొన్న సాయంకాలం మొఘల్‌కే వెళ్ళిపోయింది."

"వె...ళ్ళి...పో...యిం...దా?"

"అవును. చాలా నిరుత్సాహంతో వెళ్ళి పోయింది"

ఇద్దరూ యింక మాట్లాడుకోలేదు, పదాలు అవసరం లేకుండానే అనిశ్చితలో హృదయాలు మాట్లాడుకున్నాయి; పరిస్థితులు అవగాహన చేసుకున్నాయి. మౌనంగా నడుస్తూ ప్లాట్‌ఫారం బయటికి వచ్చారు.

''మురళీ, మాయింటికి వెళ్దాం, వస్తావా?''

''ఊఁ...పద''

నారాయణస్వామి కుదిర్చిన జట్కామీద యిద్దరూ యిం టికి వెళ్ళారు. స్వామి డాక్టరుయింటివైపుగా నడిచాడు.

ఆడసుందడిలేని యిల్లు అరణ్యంలా వుంటుంది. వంటపని చేసే వీరన్నా, విశ్వం మేనత్తా—ఈమె విశ్వం తండ్రికంటె పదేళ్ళు పెద్ద—దాసీదీ తప్ప యింట్లో ఎవరూ లేరు. ఆ గృహంలో అలికిడిలేదు, అలజడిలేదు. భయంకర మయిన ప్రశాంతత ఆ భవనాన్ని ఆవరించి వుంది.

వెళ్ళగానే ''నాన్నగారూ, ఎలావుంది?'' అని విశ్వం అడిగాడు.

తండ్రి కళ్ళు తెరిచిచూసి, కొడుకుని కౌగలించుకుని, బాష్ప బిందువులు రాల్చాడు. మేనత్త ఒక్కమారు రాగం తీసింది.

''ఇంతవరకూ మనం అదృష్టవంతులమే!'' అన్నది ముసలమ్మ.

తండ్రి మళ్ళీ మూసుకున్నాడు. ఆయన కళ్ళకి మైకం కప్పింది. మధ్య మధ్య ఏడుస్తూ, విశ్వం మేనత్త ఆయనకి సకలోపచారాలూ చేస్తోంది.

ఆ రోజల్లా నింపాదిగానే వుంది. మర్నాటి మధ్యాహ్నా నికి రోగి స్తితి ప్రమాదకరంగా మారింది. మూడోరోజు సాయంత్రం అయిదు గంటలకి విశ్వం తండ్రి జీవయాత్ర చాలించి తుదిసారి కళ్ళు మూశాడు.

విశ్వం విచారానికి అంతు లేదు. విషాదసాగరంలో మునిగి పోయాడు. బాల్యంలో తల్లితన్ను వీడిపోయింది. తన్నింకా పూర్తిగా మనిషిని చెయ్యకుండానే, తండ్రి మాయమయి పోయాడు. తనకి దిక్కెవరు? దక్షత ఎవరు? ఎవరిమీద ఆధారపడతాడు? ఆధారపడకుండా తను బతకలేడే! 'నేను వున్నాను—దిగులు పడకు'—అని అభయహస్తమివ్వగలి గిన వ్యక్తి ఒక్కరూ లేరే అతనికి !

ఒక బాధనుంచి తప్పించుకుందామనీ, పారి పోదామనీ అతను తీవ్రప్రయత్నం చేస్తూవుండగా యింకోబాధ అతన్ని తాళ్ళతో కట్టేసింది. బందీ అయిపోయాడు. ఎడారిలో దారి పోగొట్టు కున్నట్లుగా తలపోశాడు. సంతాపమూ, అశాంతి కుంగదియ్యడం మొదలెట్టాయి. నారాయణస్వామి అతన్ని వోదార్చేవాడు.

ఇరవై రోజులు గడిచినై. పరామర్శించేందుకు వచ్చిన బంధువులు ఒక్కొక్కరే తిరిగి వెళ్ళిపోయారు.

మేనత్త ఒకరోజున అంది, "నాలుగు మూడు దగ్గిర సంబంధాలు వున్నాయి. నీకు వచ్చిన పిల్లని చేసుకో. నువ్వు ఒకయింటివాడివి అయితే చూసి, ఈ గుక్కెడు ప్రాణం వదలాలని వుందిరా."

"అబ్బాయిగారూ! పెళ్ళి చేసుకుంటే ఈ బెడద కొంత తగ్గుతుంది మీకు," అన్నాడు నారాయణస్వామి కూడా.

విశ్వం తేలికగా నవ్వాడు. "నేను పడుతున్న బాధ చాలు. ఇంకొకర్ని కూడా వేధించడం నా తలంపు కాదు. నేను నా భార్యని సుఖపెట్టలేను."

నారాయణస్వామి తీక్షణంగా ఆలోచించాడు కారణాల కోసం. మేనత్త అలా అనకూడదంటూ లబో—లబో' అంది.

ఒక నెల—రెండు నెలలు—మూడు నెలలు గడిచి పోయినై.

తండ్రీ నారాయణ స్వామికి పాతికే యిచ్చేవాడు. ఇప్పుడు విశ్వం ముప్ఫయిఅయిదు రూపాయిలుయిస్తున్నాడు. పొలాలకీ, స్థలాలకి, యిళ్ళకీ, అద్దెలకీ, తోటలకీ సంబంధించిన సమస్త వ్యవహారాలూ నారాయణస్వామి యిష్టం మీదనే జరుగుతున్నాయి. బాధ్యతఅంతా స్వామినెత్తిని పెట్టి, తను కావ్యాలూ గ్రంథాలూ చదువుకుంటూ కాలక్షేపం చెయ్యడం మొదలెట్టాడు విశ్వం.

ఒక మధ్యాహ్నం

"బాంకు నుంచి రెండువందలు తెచ్చిపెట్టు స్వామీ, ఇవ్వాళ రాత్రి వూరు వెళ్ళాలి"

ఏవూరు వెళ్తాడో తెలుసుకుందా మనుకున్నాడు స్వామి. అడుగుదామని నోటిదాకా వచ్చింది. కాని సాయింత్రం తనకి ఎలాగా తెలుస్తుంది కదా అని అడగలేదు.

సాయంత్రం విశ్వం స్వామితో అన్నాడు. "నేను రాత్రి మద్రాస్ వెళ్తున్నాను. నాలుగయిదు రోజుల్లో వస్తాను."

"చిత్రం."

మద్రాస్‌కి వెళ్ళే మెయిలూ, మద్రాస్ నుంచి వచ్చే మెయిలూ నిశిరాత్రి వేళ ఒక చిన్న స్టేషన్‌లో కలుసుకున్నాయి ఒక మెయిల్‌లో ఒక యువకుడు ఆశ కొలిపే నక్షత్రాల్నీ, భయంకరతని తోపించే అంధకారాన్నీ బరువయిన కనురెప్పలతో చూస్తున్నాడు. ఇంకో మెయిల్‌లో ఒక యువతి దూరమైపోయిన ఆశాకిరణాల్నీ, నిస్సారతని తోపించే కారుచీకట్నీ గుండె బరువుతో చూస్తోంది. వారిద్దరూ చెరోవైపుకీ ప్రయాణం చేస్తున్నారు. ఇద్దరిదీ చెరోదారీ—మార్గమధ్యంలో విధివశాత్తూ కలుసుకున్నారు. కాని, ఒకర్ని యింకోరు చూసుకోలేదు,—చూసుకోలేక పోయారు; ఎవరి ఆలోచనలు వారివే అయిపోయిన్నై, ఎవరి మార్గాలు వారివే అయిపోయిన్నై.

ప్రయాణం చెరోవైపుకీ.

## 13

విశ్వం మనోహర భవనంలో బస చేసి, అక్కణ్ణుంచే ముకుందరావు గారింటికి ఫోను చేశాడు.

సరిగ్గా ఆవేళకే ముకుందరావూ సుశీలాదేవీ సూదర్శన మహాశయుని వర్గపోరాట విధానంగురించీ, గాంధీ మహాత్ముని వర్గ సామరస్య సిద్ధాంతంగురించీ చర్చిస్తూవున్నారు.

"Survival of the Fittest అంతకంటె యేమీ లేదండీ, మిగతావన్నీ డంబాలూ, బూటకాలూ, అనాచరణీయాలూ.................."

పూర్తి చెయ్యలేదు ఆమె చెప్పదలుచుకున్నది. ఫోను గణగణ మోగింది.

ముకుందరావు పేము కుర్చీలోనుంచి లేచి ఫోను దగ్గిరికి వెళ్ళి "హలో ఎవరండీ?" అన్నాడు.

"నేను విశ్వాన్ని—కృష్ణనగరం. ముకుందరావుగారి గృహమేనా ?"

"అవును"

"మాట్లాడుతున్న వారెవరండీ ?"

"ముకుందరావే......ఏం పని ?"

విశ్వం ఒక్కక్షణకాలం జాగు చేశాడు.

"శ్రీమతి లీలావతి ఇంట్లో వున్నారా ?"

ముకుందరావు ఫోను మూసి, భవిష్యత్ నాగరికత అంతా కమ్యూనిజం మీద ఆధారపడి వుందా—రామ రాజ్య సిద్ధాంతాలలో ఇమిడి వుందా, అని తీవ్రంగా ఆలోచిస్తున్న సుశీలాదేవిని వుద్దేశించి అన్నాడు. 'ఎవరో విశ్వముట. లీల వుందా అని అడుగుతున్నాడు మీరెరుగుదురా ఆయన్ని ?'

సుశీలా దేవి ఒక్క పెట్టున 'వర్గ' వ్యవహారంలో నుంచి సామాజిక కాండలోకి పెద్దదూకు దూకింది. 'వూరు ఆయనిది ?''

''యేదో చెప్పారు. అడుగుతా నుండండి...మీరే వూరండీ ?''

చిరాకుతో అన్నాడు విశ్వం. 'కృష్ణనగరం...ఆమె ఇంట్లో వున్నారా ?'

ముకుందరావు సుశీలా దేవితో చెప్పాడు. 'కృష్ణనగరం.'

''ఓ...వారా ! ఉండమనండి- నేను మాట్లాడుతాను,''

సుశీలా దేవి ముకుందరావుగారి వద్దనుంచి ఫోను తీసుకు, మాట్లాడింది. 'ఇందాకట్నుంచీ మాట్లాడిన వారు ముకుంద రావుగారు. నేను సుశీలా దేవిని. లీలావతి నా ఫ్రెండు...''

అవతల కోసనివున్న విశ్వానికి తనకి అవసరమయిన వ్యక్తి ఫోను దగ్గిరికి రాకపోవడమూ, ఆమె గురించిన సంగతి సందర్భాలు తెలుసుకునే అవకాశం లేకపోవడమూ చాలా చీకాకు కలిగిస్తోంది.

''లీలావతి యింట్లో వున్నారా ? బయటికి వెళ్ళారా ? వెళ్తే ఎప్పుడు వస్తారు ?''

''చెప్తాను వుండండి. అంత వేగిర పడితే ఎలా ?''

''ఈ పెద్దమనిషెవరో ఒక పావుగంటదాకా వదిలేట్టు లేడు. మేడమీదికి వెళ్ళి పదినిముషాల్లో వస్తాను. ఆఫీసుకి

మైమ వృతోంది. డ్రెస్ మార్చుకుని వస్తాను,'' అంటూ ముకుందరావు మేడెక్కాడు.

ఫోనుదగ్గిర సుశీల ఒక్కర్తేవుంది.

''వీరు మద్రాస్ వచ్చారు. మీకోసం మీ స్నేహితురాలు కృష్ణనగరం వెళ్ళింది.''

''మీకూ, లీలావతికీ చాలా పరిచయం వుందా ?''

''ఉండబట్టే నక నే యిలా మాట్లాడుతున్నాను.''

''మరి, ఇప్పుడు నాతో మాట్లాడిన ఆయన, ఆమెభర్త, అక్కడ లేరూ ?''

''లేరు. ఉంటే నేం...?''

''ఏం లేదులెండి. ఎప్పుడు వెళ్ళింది లీల ?''

''నిన్నరాత్రి మెయిల్ కి.''

''నిన్నరాత్రే !''

''అవును......దిగులు పడకండి. మీరక్కడ లేరని తెలీగానే, తిరిగి వచ్చేస్తుంది............మీతో చాలా విషయాలు మాట్లాడాలి. సాయంత్రం మూడింటికి ఇక్కడికి టీకి వస్తారూ ? ముకుందరావుగారితో పరిచయం కలుగజేసుకోవచ్చు కూడాను. ఆయన ఉదార స్వభావులు. చాలా మంచివారు.''

''అలాగా !'' ఆ 'అలాగా' లో ఎంతో నిర్లక్ష్యం వుంది- ముకుందరావుతో తనకేంపని అన్నట్లు.

''వస్తారు కదూ ?......తప్పకుండా ?''

"ఉహు"

"మీ మకాం ఎక్కడ?"

"మనోహరభవన్."

"సెలవు."

ఫోను కింద పెట్టేసింది సుశీల. నిర్విణ్ణుడైపోయాడు విశ్వం.

ఎవరీ అమ్మాయి! తన జీవిత రహస్యాలన్నీ తెలుసుకున్న వ్యక్తిలా మాట్లాడుతోందే!!

విశ్వం విధిని ఎప్పుడూ విశ్వసించలేదు. కాని ఇతని విశ్వాసాలతో గానీ ఇంకెవ్వరి విశ్వాసాలతో గానీ నిమిత్తం లేని ఒక మహత్తరశక్తి వివాహం అయిన నాటినుంచీ లీలనీ విశ్వాన్నీ స్థిరసంకల్పంతో వేరుచేస్తూ, విడి విడిగా, దూర దూరంగా, ప్రత్యేకంగా వుంచుతోంది.

ఇద్దరిలో యేఒక్కరూ ప్రప్రథమంలో ఎట్టి త్యాగం చేయడానికీ ముందంజ వెయ్యలేదు. పీసమంత సాహసమయినా చూపలేదు. పరిస్థితులకు లొంగిపోయారు. సంఘం యేర్పాటుచేసిన నియమాల్ని ధీమాతో ధిక్కరించలేక పోయారు: ధైర్యంతో పోరాడలేక పోయారు.

తండ్రి యిచ్చే సిరిసంపదల్ని తృణీకరించలేని పిరికిపంద ఒకవైపునా, మామమాటల్లోని యథార్థాన్ని శంకించి కూడా తన వ్యక్తిత్వాన్ని నిరూపించుకోలేక లోబడిపోయిన అమాయిక యింకోవైపునా—ఇవి వుజ్జీలు!

ఏ ఒక్కరిలోనూ ఆత్మశక్తి లేకపోయింది. జీవనశక్తి మరుగు పడింది. ఎవరికోసం బతకాలని నమ్మారో, బతుకుతున్నామని అనుకున్నారో—నిజానికి వారికోసం బతక లేదు.

ఆరంభంలోనే హంసపాదు. జీవితమంతా తికమకలు. అశాంతి, తీరని ఆవేశనా, ఆరని మంటలూను.

ఎంతకీ మనస్సులో వాద ప్రతివాదాలు సల్పారేకాని, హృదయం ఏదయితే సత్యాస్థిర మయినదని చెప్తోందో, దాన్ని ఆచరణలో పెట్టడం కోసం మార్గాలు వెతక లేదు. భయపడ్డారు. ఆ నాలుగు గోడలలోనుంచీ బయటికి రావడానికి తెగింపు లేదు — తెగింపు లేని బతుక్కి శాంతీ సౌఖ్యమూ లేవు.

విశ్వాన్ని చూదామనే ఆశతో వచ్చిన లీల, విశ్వం మద్రాస్ వెళ్ళాడని తెలుసుకోగానే పడ్డ క్షోభ, యింతా అంతా కాదు.

ఆమెకి తల్లి పల్కులలో మాతృహృదయం కనిపించడం లేదు; మామ మాటలలో అనురాగం కనిపించడంలేదు; సోదరుని కబుర్లలో సానుభూతి కనిపించడంలేదు. ఒక్కటే కనిపిస్తోంది—తమస్సు. దాన్ని చీల్చగలిగే ఆశాజ్యోతి కునుకుతూ ఆరిపోవడానికి సిద్ధంగావుంది.

ఈ దెబ్బతో లీలకి విధిమీద అకస్మాత్తుగా ఒక నమ్మకం కలిగింది. విధికి తామిద్దరూ కలుసుకోవడం ఎంతమాత్రం యిష్టంలేదనీ, అందుకే ఈ అంతరాయాలన్నీ అనీ తల

పోసింది. విధికి ఎదురీది సాధించగలగడం అసంభవం. అంచేత అసహాయతతో—ఏ అసహాయతతో ఆమె వివాహానికి సమ్మతించిందో అలాంటి అసహాయతతోనే—విశ్వం గురించి ఆలోచించకూడదనీ, అతనికోసం ప్రాకులాడ కూడదనీ, హృదయంలో అతనికి వున్న స్థానాన్ని తన భర్తకే ప్రసాదించాలనీ నిర్ణయించుకుంది.

సాధ్యమా? ఇంతకిపూర్వం యిలా ఎన్నిసార్లు అనుకోలేదు,—అనుకున్న మర్నాడే అతనికోసం మనస్సులో ఎంత వ్యాకులపడలేదు, ఎంతవుబలాట పడలేదు?

ఇప్పటి పరిస్థితులు వేరు. విధిమీద ఆమెకి విశ్వాసం కుదిరింది. ఆ పరిస్థితులలో అలాంటి నమ్మకం మూఢత్వమవచ్చు. కాని హృదయాన్ని అప్పటికప్పుడే ఆవరించి వున్న అంధకారానికి నల్లటిపూత పూసింది—ఆ విశ్వాసం.

## 14

వస్తాననే మాట యిచ్చికూడా విశ్వం సుశీలాదేవిని నిరుత్సాహ పరిచాడు. సాయంత్రం అయిదు గంటలదాకా ఆమె అతని రాకకోసం నిరీక్షిస్తూ కూచుంది. ఆరుగంటలకి ముకుందరావు ఆఫీసునుంచి వచ్చాడుగాని విశ్వంజాడ లేమీ గోచరించలేదు.

ముకుందరావు యింటో కాలు పెట్టగానే అన్నాడు. 'మన టెలిఫోన్ ఫ్రెండుటీకి వచ్చాడా?'

"రాలేదు."

"చిత్రంగావుందే! వస్తానని రాకపోవడమేమిటి?

"నాకు ఏమీ పాలుపోవడం లేదు."

"పోన్లెద్దురూ, ఇవ్వాళ మోడరన్ థియేటర్‌లో భరత నాట్యముంది. వెళ్దాం రండి. మన టెలిఫోన్ ఫ్రెండుకూడా వుంటాడేమో, వస్తాడేమో అని మూడు టిక్కెట్లు తీసుకొచ్చాను."

"ఊఁ, సరే పదండి..."

ఇద్దరూ టీతాగి థియేటర్‌కి వెళ్ళారు. ఇంటికి తిరిగి వస్తున్నప్పుడన్నాడు ముకుందరావు: 'లీలలో కనిపిస్తున్న మార్పు మీరూ గమనించేవుంటారు.'

ఏమీ ఎరగనట్టు సుశీలాదేవిఅంది. 'ఏం మార్పు?'

"మునుపటి చురుకుదనం లేదు పరధ్యానమూ, విసుగూ ఎక్కువైనాయి."

"వెళ్ళేముందు ఏమయినా మాటా మాటా అనుకున్నారా?"

"అబ్బే! ఏంలేదు.........ఆమె విసుక్కున్నా, నేను తొందరపడను. ఆమె తీరూ, తరహా నాకు పూర్తిగా తెలుసు."

"మంచిదే—భార్యా భర్తలు అలాపొత్తు కలుపుకు మసలడం."

"సదా ఆలోచించే ఆమె నేత్రద్వయం వంక చూస్తే నాకు దిగులు వేస్తుంది. నా అసహాయత నన్ను వెక్కిరిస్తుంది. ఇంత ప్రేమిస్తూ వుండికూడా, ఆమెని కలవరపెట్టి కుంగదీస్తున్న సమస్యని తెలుసుకోలేని నా అజ్ఞానానికి బాధపడుతున్నాను......"

ముకుందరావు తనని ఎక్కడికి తీసుకు వెళ్ళుతున్నాడో సుశీలాదేవి మొట్ట మొదటనే గ్రహించింది. ఆమె మొగవారితో పైకి చక్కగా మాట్లాడుతుంది కాని మనస్సులో వారంటే అపనమ్మకం. ఆమెకి పురుషజాతిమీద విశ్వాసం లేదు. పురుషులందరూ, కొద్దిపాటి చిన్న చిన్న అభిప్రాయ భేదాలతో, ఒక్కటే అనీ—ఒకే ముష్కర సంతతికి చెందుతారనీ—ఆమె స్థిరనిశ్చయం. అది ఆమె మేధాశక్తిలోని దోషం కాదు. పురుషులతోటి అనుభవాలు ఆమెని ఆ నిర్ణయానికి తీసుకువెళ్ళాయి.

"నేను చనువుగా మాట్లాడుతున్నంతమాత్రాన నా స్నేహితురాల్ని మోసగించి, ఆమె నా హృదయ పేటికలో దాచుకున్న జీవిత రహస్యాలు బట్టబయలు చేస్తాననుకోవడం వొట్టి తెలివి తక్కువతనం. స్త్రీనీ, స్త్రీ నిజస్వభావాన్ని అర్థంచేసుకోలేని అశక్తత. దూరదృష్టి లేదనడానికి ప్రబల నిదర్శనం. చాలామంది భర్తలు అంతే?" అనుకుంది సుశీలాదేవి.

ముకుందరావు పాటికి పోలేదు. లీలావతి మనోవేదనకి కారణమయిన విషయాల్లో ఏ ఒక్కటీ సుశీలాదేవి నోటి నుండి పెగలలేదు. పయిగా, ఒక్క చురక తగిలించింది.

"సాధారణంగా భర్తలకి కలిగే అనుమానాలు మీకు కూడా కలుగుతున్నాయేమిటి?"

ముకుందరావు తలవాల్చుకున్నాడు ఖిన్నుడై పోయాడు. సుశీలాదేవి తనకి తోడ్పడుతుందనుకున్నాడు కాని, ప్రయోజనం లేకపోయింది ఆమె తనను ఒక అనుమానపు పెనుభూతంలా తలపోస్తోంది. మార్గాంతరం......? లేదు. లీలనే అడిగితే .....? లీలకి నిజం చెప్పగలిగే ధయిర్యమేవుంటే, యిలా నిష్కారణంగా ఎందుకు బాధపడుతుంది?......... పొరబాటు; ఆమెని జన్మలో అడక్కూడదు.

పుష్పంలా నవ నవ లాడే ఆ పిల్ల యిలా ఎండి మాడి పోవలసిందేనా! సమాజపు కట్టుబాట్లు కొన్ని, మనుష్యుల్ని ఎంతటి అధోగతి కయినా తీసుకు వెళ్తున్నాయి. పరస్పర సహకార సానుభూతులకి బదులు పోరాటమూ నిరంతరానుమానమూ మానవ హృదయంలో రాజరికాన్ని చెలాయిస్తున్నాయి

సుశీలాదేవి ముకుందరావుని—కాదు, పురుషులందర్నీ—హృదయం లేని రాక్షసులనే ఆరంభ సూత్రంతోగాని పరికించలేదు. దిన దిన క్షీణతకయినా అంగీకరిస్తుంది గాని లీలావతి సాహసించి, సమాజం తనకిచ్చిన భర్తతో తన

గుండె మంటని చెప్పుకోలేదు. సూరీక్కాంబ కూతుర్ని అత్తారింటికి పంపి గుండెలమీది కుంపటి కిందకి దింపుకున్నా ననుకుంది, పాపం!!

ఇక ముకుందరావు, అతనిలో నిజాయితీ వుంది. ఆ నిజాయితీని సుశీలా దేవి గుర్తించకపోవడం ఆమె లోపం అని అనడంకూడా సాహసమే!

కథంతా ముకుందరావుతో వుంది. లీలావతి సౌఖ్యం కోసం, ఎట్టి త్యాగాన్ని అయినా చెయ్యడానికి అతను సిద్ధంగా వున్నాడు. లీల ఎవర్నయినా ప్రేమిస్తోందా? ప్రేమిస్తూవుంటే, ఎవరతను? ఎక్కడవున్నాడు? ఆ ప్రేమకి పుట్టు పూర్వోత్తరాలేమిటి? వునాదెక్కడ? అలా బాధపడి కృశించకపోతే, తనతో చెప్పకూడదా తన కోర్కెలేమిటో!!

ఎవరు చెప్తారతనికి? గౌరవనీయుడైన భర్తకి అతని భార్య. ప్రేమకలాపాలు ఎవరు చెప్పగలరు? చెప్పగలిగేది ఒక్క సుశీలే? కాని ఆమెకూడా సంశయించింది. ఇంకెవ్వరూ చెప్పరు. ముకుందరావు అజ్ఞానంలో వుండవలసిందే!!

# 15

మర్నాటి వుదయం తొమ్మిది గంటలకే సుశీలాదేవి మనోహర్ భవన్‌కి వెళ్ళింది. విశ్వం అప్పుడే కాఫీ పుచ్చుకుంటున్నాడు.

అపరిచితవ్యక్తి రాక గమనించి విశ్వం తెల్లబోయాడు.

"ఎవరు మీరు ?"

"సుశీలాదేవిని."

"ఆ...కూర్చోండి." అంటూ కుర్చీచూపించి, 'ఎవరా ఈమె ?' అని జ్ఞాపకం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు.

సుశీలాదేవి కూచుని, అతని కనుబొమలవంక తేరిపార జూసి, 'నిన్న టెలిఫోనులో మాట్లాడింది నేనే. మీకోసం సాయంత్రం ఐదు గంటలదాకా వేచివున్నాను,' అంది.

విశ్వం అప్పటికి గ్రహించి, "మీ...రా ?" అన్నాడు, చిరునవ్వుతో.

"ఊఁ.....రాలేదేం ?"

"ఏదో...—" నసిగాడు,— కాఫీకప్పు బల్లమీద పెట్టి.

రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఆమె అతని హోల్డాలూ, సూటుకేసూ, టేబుల్ మీద వున్న షేవింగు సామానూ, టాయిలెట్ సామానూ గోడకి తగిలించివున్న హోటల్ వారి రూల్సూ పరకాయిస్తోంది. మధ్య మధ్య వరండాలో ఇటూ అటూ పరిగెడ్తున్న హోటల్ నౌకర్లని చూస్తోంది.........అతను? ఈమెతో ఏమి మాట్లాడ్తనూ అని తీక్షణంగా యోచిస్తున్నాడు.

"మీరుకూడా కాఫీ పుచ్చుకుందురు గాని !" అంటూ కాలింగ్ బెల్ నొక్కాడతను.

"ఇప్పుడే పుచ్చుకు వచ్చాను"

"వొట్టి కాఫీ యే!......ఇంకేం తీసుకోవద్దు లెండి."

కాఫీ వచ్చింది. ఇద్దరూ పుచ్చుకున్నారు.

"నేనెవర్నో మీకెలా తెలుసు? లీల చెప్పిందా ?"

"ఔను."

"ఇంకా, ఏం చెప్పింది ?"

"అంటే ?"

"నన్ను గురించి"

"మనస్సులో వున్నవన్నీ చెప్పింది."

"అన్నీ ?"

"ఊఁ...ఒక్కటికూడా దాచకుండా........."

విశ్వం మొహం వివర్ణమయింది. కళ్ళలో కలవరం కని పించింది. అంతకి పూర్వం వున్న దృఢత్వం ఒక్క క్షణంలో మాయమైపోయి, మబ్బుల్లో దాక్కుంది. తన జీవితాన్నీ, Escape నీ పుస్తకంలా చదివెయ్యగల మనిషి సమక్షంలో తను వున్నానన్న భావన అతన్ని విహ్వాలుణ్ణి చేసింది. మొదట్లో కొద్దిగా జంకాడు కాని, తర్వాత, ఆమెని ఎంతో కాలంనుంచీ, ఎన్నో యుగాలనుంచీ ఎరుగున్నంత చనువు కీలనూడు. ఆమె ముఖంలోని పవిత్రమయిన తేజస్సూ, కళ్ళల్లోని అమృతకాంతులూ, మాటల్లోని అద్వితీయ మాధు ర్యమూ అతని కంపిత హృదయంలోని ఆరాటాన్ని కొంత వరకూ తగ్గించాయి.

అయిదు నిముషాల నిశ్శబ్దం.

‘‘ఇలా ఉషల్లా మౌనంగా కూచోడం నాకేమీ బాగుండ లేదు,’’ అంది, సుశీలాదేవి.

దెబ్బతిన్న లేడి పరిగెడ్తుంది. కాని, విశ్వం ఎక్కడికి పరిగెడ్తాడు ?

‘‘మీరు నన్ను చూడాలని శ్రమపడివచ్చారు. నే నేదో ఆలోచనలో పడిపోయాను...క్షమించండి......... లీల వెళ్ళిం దన్నారూ ?’’

‘‘మొన్న రాత్రి’’

పావుగంట కాలం బాతాఖానీలో గడిపారు—ముకుంద రావు ప్రస్తావనకూడా వచ్చింది.

‘‘ముకుందరావుగారు చాలా యోగ్యులు,’’ అంది సుశీలాదేవి.

‘‘అలాగా !’’

ఇంకో పావుగంట కబుర్లతో గడిచినతర్వాత విశ్వం దీనంగా ప్రారంభించాడు. ‘లీలని మర్చిపోదామని ఎంతో ప్రయత్నం చేశాను. ఆమెని చూస్తూవుంటే ఎలాంటివాంఛలు కలుగుతాయో అన్న భయంతో ఆమెని చూట్టమే మానే శాను,......నా ప్రయత్నాలన్నీ విఫలమై పోయాయి. నే నెందుకు జీవించాలో, దేనికోసం జీవించాలో తెలుసుకో లేని అగమ్యగోచరస్థితికి వచ్చాను......ఇంక, లీల శీతలహస్తం తగలకుండా నా హృదయాగ్ని చల్లారడం అసంభవమూ, అసాధ్యమూను,’’

"మరి, ఆమె జీవితం ?"

"ఆమె జీవితానికేం ?"

"దాంపత్య జీవనం ?"

విశ్వం జవాబు చెప్పలేకపోయాడు.

సుశీలాదేవి అంది. 'మీరు పొరబడుతున్నారేమో! మీరనుకున్న ధోరణిలో లీల మిమ్మల్ని ఆదరించలేదేమో !'

"నా ధోరణి అనగా !"

"వాంఛలు. లీల తరహా అలాటిది కాదు. ఒకరికి మనసిచ్చి వారిదగ్గర వుల్లాసంగా ప్రవర్తిస్తూ, యింకోరి దగ్గిర, మనస్సులేకుండా నేర్పుతో నటించలేదు. అటో— ఇటో, అంతే !"

"ఇప్పుడెలా తేలుతుంది ?"

"మీ రిద్దరూ దుర్బలులు. సంఘం ఏర్పాటు చేసిన కాలంతపు గోడలు కాలితో తన్ని పడగొట్టలేరు. మీ ఆత్మలలో ఔన్నత్యం ప్రకాశిస్తూ వుంటుంది—అంచేత, నీచానికి పాల్పడలేరు. ఫలితం : బలి అయిపోవడం."

"అంత అసమర్థులమా ఇద్దరమూను ?"

"అవును. నిజంచెప్పానని కోపగించకండి. ఒకర్నొకరు కలసుకోక పోవడమే ఇద్దరికీ క్షేమదాయకం."

హృదయంలోని బాధని వ్యక్తపరిచే కంఠంతో అన్నాడు విశ్వం. 'నే నామెని చూదామని వచ్చానండీ—మీ రిలా అంటున్నా రేమిటి ?"

"నాకు తెలుసు. మీ రెంత కాంక్షతో ఆమెని చూడా మని వచ్చారో, మీ తండ్రిగారు పోయిన తర్వాత మిమ్మల్ని కలుసుకో లేనని నాకు చెప్తూ, అంత కాంక్షతోనే లీలకూడా కృష్ణనగరం వెళ్ళింది."

విశ్వం కొద్దిగా గర్వపడ్డాడు.

సుశీలాదేవి అందుకుంది. 'మీరు లీలని నిజంగా సత్య సమ్మతమయిన హృదయంతో ప్రేమిస్తూవుంటే, ఆమె సమ క్షంలో మసలాలనే కోరిక మొట్టమొదట చంపుకోండి, లీలకి సంతానం కలిగేదాకా ఆమెని చూడకండి"

"నా ప్రేమలో మీకు విశ్వాసం లేదా ?"

"లేక కాదు, వుండే! మీరు ఆచరిస్తారనే నమ్మకం తోనే చెప్తున్నాను."

"ఇది చాల ఘోరమయిన శిక్ష."

"శిక్ష కాదు......ఆమె యిప్పుడు తన భర్తని ప్రేమించ లేకుండా వుంది; మిమ్మల్నే ప్రేమిస్తోంది. బిడ్డలు కలగగానే మాతృహృదయంలో ఈ ప్రేమ వాత్సల్యంగా పరిణమిస్తుంది; సంతానం హృదయాన్ని ఆక్రమించుకుంటుంది."

"అప్పుడు నాకు చోటువుంటుందా,—ఈ కునుకు దీపం ఆరిపోవలసిందేగాని !"

"ప్రతిఫలం ఆశించకుండా ప్రేమించడం మహోన్నత మయినది కాదూ !"

"అవవచ్చు, కాని, సాధ్యమా ?"

"సాధ్యం కానిదేదీ లేదు. సంకల్ప సిద్ధిలో వున్నాయి పవిత్రతా, పటుత్వమూను."

సుశీలాదేవి విశ్వాన్ని బుజ్జగించి, మూడోరోజు సాయంత్రం మద్రాస్‌నుంచి పంపివేసింది.

నాలుగో నాటి వుదయం లీల దిగింది. విశ్వం తనకోసం వచ్చి, వెళ్ళిపోయాడని తెలిసి, గాంభ్రమంది.

సుశీలాదేవి నవ్వుతూ ఓదార్చింది. 'బయటికి పోతే ఎండా—వానా. నువ్వు చలికి ఆగలేవు, తాపాన్ని భరించ లేవు"

లీల అంది. నిస్పృహతో. 'నాసటిరాత !"

అవును. విధి నిర్ణయం !

## 16

లీలకి నెలతప్పింది. మూడో నెలలో పుట్టింటివారు తీసుకు వెళ్ళారు. అయిదో నెలలో అత్తారింటికి—అదే భర్తఇంటికి—వచ్చేసింది.

సంవత్సరాల దాంపత్య జీవనం గడిచిపోయింది. ఒకరికొకరు అలవాటు అయిపోతూ రోజులు గడిపేస్తున్నారు. హృదయాలలో సామరస్యంలేదు; కలయిక లేదు. ఎవరి హృదయాలు వారివే !

తన భార్య బాధపడుతోంది కదా అని ముకుందరావు కూడా బాధ పడుతున్నాడు. ఆమె అశాంతి అతని అశాంతికి

కూడా హేతువు అయింది. అందుకు ఫలితంగా కాపరంలో కమ్మదనం శూన్య మయింది.

ఆ దాంపత్యంలో ఆమెకీ సంతోషం లేదు; అతనికీ సంతోషం లేదు. ఆనందం లేదనీ, ఒకరి కొకరు ఆనందాన్ని ఇవ్వలేమని తెలుసుకున్నా కూడా విడిపోడానికి వీలుకాని ముడి ఈ దేశంలోని వివాహం. కర్మకాండకి సంబంధించిన బంధం కాదూ,—అంచేత !! వారలా నిస్తేజులై కట్టుకొయ్యలకి బంధితులై వున్నారు.

ఆ ఇంట్లో ఏ ఒక్కరికీ ఇంటిమీద ఆసక్తి లేదు. ఇంట్లో వుండటమంటే ముళ్ళమీద కూచున్నట్టు వుంటుంది. క్లబ్బుకో, సినిమాకో, స్నేహితు లింటికో పోతుంది ఆమె. అతనూ అంతే!......ఎవరిదారి వారిదే! ఎవరిగోల వారిదే !!

ఇంట్లో వంటమనిషి వుంది కనక వంట సిద్ధంచేసి వుంచుతుంది. ఎవర్కైమటికి వారు తింటారు. ఒకరి ప్రసక్తి ఇంకొకరికి అక్కర్లేదు.

సాధారణంగా, ఆమె ఏదో పుస్తకం పుచ్చుకు పక్క మీదికి వొరుగుతుంది; అతను ఏవో ఆఫీసు కాయితాలు తిరగేసి తిరగేసి పదకొండు గంటలకి తనగదిలోకి పోయి పడుకుంటాడు.

ఉత్సాహంగా వున్ననాడు, రాత్రి భోజనం అయిన తర్వాత, తమలపాకులు నములుతూ ఇద్దరూ సరదాగా

పిచ్చాపాటీ చెప్పుకుంటూ ఖులాసాగా నవ్వుకుంటూరు. ఆ రోజున వారినిచూస్తే అంతకంటె అన్యోన్యమైన దాంపత్యం పృథ్విలో ఎక్కడైనా వుంటుందా అనే భ్రమ కలుగుతుంది.

జీవితంలో అసంపూర్ణత ఇద్దరూ ఫీలయి తెలుసుకున్నాడా, తెలియనట్లుగా నటిస్తున్నారు.

రమణయ్య పంతులు లీలని అత్తవారింట్లో దిగబెట్టి వెళ్తూ అన్నాడు. 'అమ్మాయీ, అప్పుడు నేను నీకేదో అన్యాయం చేశానని భావించావ్! ఇప్పటికయినా తెలిసిందా, నేను చేసిన పని దూరదృష్టితో చేశానో లేదో! అన్ని గాయాల్నీ మాన్పగలిగిన మందు కాలం ఒక్కటే!' తను చేసిన ఘన కార్యానికి తన్ను తానే అభినందించుకున్నాడు—

లీలావతి నీరసంగా నవ్వింది. ఆమె హృదయం నిజంగా విశ్వాన్ని మర్చిపోగలిగిందా?

ఒకరోజు మధ్యాహ్నం సుశీలాదేవి వేళాకోళం చేస్తూ అంది. 'నీకు పిల్లాడు పుడితే విశ్వమనీ, పిల్ల పుడితే విశ్వేశ్వరనీ పిలుచుకుంటావు కాదూ?'

"ఊహు..............పవిత్రపదాల్ని ధ్వంసం చెయ్యడం నా అభిప్రాయం కాదు."

"ఏం?"

"విశ్వం" అనేది నాకు పవిత్రపదం దాన్ని మాలిన్యం చెయ్యను................భగ్న ప్రేమ నా జీవితమంతా

నిరాశాపేతంగా చేసింది. ఎందుకీ బతుకు? ఎవరికోసం;"
లీలావతి కళ్ళు చెమ్మగిల్లినై.

సుశీలాదేవి ఓదార్చింది. 'గర్భిణీ స్త్రీ మనోవ్యాధితో కుంగిపోకూడదు.

"సీ స్కూలులో చెప్పు ఆ పాఠం. పాఠాలు నేర్చుకునే కాలం తీరిపోయింది. ఇది అనుభవించే సమయం."

సుశీలాదేవి విషయం మార్చి, తెనాలి రామకృష్ణుని కథలలో ఒకటి చెప్పింది.

లీలావతి ఆరోనెలలో వంటవసారా దగ్గిర జారిపడింది. ఆ రాత్రి కొద్దిగా జ్వరం వచ్చింది. మూడోనాటికి నెమ్మదించింది.

ఏడోనెల రెండోవారంలో మళ్ళీజ్వరం వచ్చింది, రెండు మూడు రోజులలో తగ్గుతుందనుకున్నారు కాని తగ్గలేదు. నాలుగోరోజుకి ఎక్కువ అయింది; తీవ్రత హెచ్చింది.

నాలుగోరోజు సాయంత్రానికి రమణయ్య పంతులూ, మాణిక్యాంబా, మురళీ, కృష్ణనగరం నుంచి వచ్చారు. ఆరాత్రి లీలావతికి పలవరింతలూ తప్పుడుమాటలూ ఆరంభమైనై.

అయిదోనాడు విశ్వం గురించిన పలవరింతలు.

"ఎవరీ విశ్వం?" అని అడిగాడు ముకుందరావు సుశీలాదేవిని.

"చిన్నప్పుడతన్ని ప్రేమించింది లీల. అతన్నే పెళ్ళిచేసుకుందా మనుకుంది. పరిస్థితులు అనుకూలించలేదు"

"నా కిన్నాళ్ళనుంచీ తెలీదే!"

"తెలిస్తే, ఏంచేసి వుందురేమిటి?"

"మీరే చూసివుందురు కదా!" అన్నాడు ముకుందరావు కుంగిపోతూ, 'లీలని యిలా అనవసరంగా కృశించి పోనిస్తానా? నిష్కారణంగా కుమిలిపోనిస్తానా?"

"ఇప్పుడు మాత్రం మించిపోయిన దేముంది?"

"నా దృష్టిలో అంతా మించిపోయింది. ఇంతటి మనోవ్యధలో మునిగివున్న లీల ఈ గండం గడిచి గట్టెక్కుతుందా?.........అయ్యో! మీరయినా నాతో ఎప్పుడూ అనలేకపోయారే!"

ఇప్పుడు తెలుసుకో గలిగింది సుశీలాదేవి ముకుందరావు లోని నిజాయితీ. తెలుసుకున్నా, పురుషు లందరూ పశువులనీ, పువ్వుల్లాంటి కోమలుల్ని వారు నలిపేస్తున్నారనీ— అన్న అభిప్రాయం ఆమె మార్చుకో దలుచుకోలేదు.

"భార్య ప్రమాదకరమైన జబ్బులో వుంది కనక ఇలా మాట్లాడాడు భర్త. భార్య కడుపునిండా తిని, ఖులాసాగా తిరుగుతున్న రోజులలో ఇంత ఔదార్యాన్ని చూపగలడా?" అనుకుంది సుశీలాదేవి, మనస్సులో.

కాని ముకుందరావు నిజంగానే చూపించే వాడేమో! ఆమె అవకాశం ఇవ్వనే లేదుకదూ!!

ఆగో రోజు ఉదయం, ఏదో తనకి తెలీని ఆవేదనలో, సుశీలాదేవి విశ్వానికి టెలిగ్రాం ఇచ్చింది.

టెలిగ్రాం

"విశ్వానికి

లీలకి చాలా జబ్బుగా వుంది — నిన్ను చూడాలని కోరుతూ వుంది — అశ్రద్ధ చెయ్యకుండా, తక్షణం బయలు దేరి రా.

సుశీలాదేవి"

జీవితంలో ఉన్నతమైనదీ, మహోజ్వలమైనదీ, ఆలంబనాన్ని ఇవ్వగలిగినదీ పోగొట్టుకున్న మనిషి నూతనత్వం కోసం పాకులాడుతాడు. విశ్వం జీవితంలో ప్రేమ నశించి పోయింది. నూతనత్వంకోసం వెతకడం మొదలెట్టాడు. ఆ అన్వేషణలో మధురిమ తోచింది. ఆ కొత్తదనంలో రుచి కనిపించింది. ఒక ప్రదేశం నుంచి ఇంకో ప్రదేశానికీ, ఒక మనిషినుంచి ఇంకో మనిషికీ, ఒక స్నేహం నుంచి ఇంకో స్నేహానికీ పోతున్నాడు. ఈ మెట్లుపైకో, కిందికో అతనికీ తెలీదు — ఎవరికీ తెలీదు. లీలని మరిపించగలవ్యక్తి అతనికి అగుపించడం వొట్టి అసంభవం. అసంభవమనే విషయం అతని కెన్నోతపాలు స్ఫురించింది. కాని, అన్వేషణ మాన లేదు కదా!

సుశీలాదేవి యిచ్చిన టెలిగ్రాం నారాయణస్వామి అందుకుని, ఆ హాంకాంలు, బొంబయిలో వున్న విశ్వానికి టెలిగ్రాం ద్వారా తెలియపరిచాడు. ఆరోజున విశ్వం బొంబయిలో లేడు. స్నేహితుల్తో పూనా వెళ్ళాడు. మర్నాడు మధ్యాహ్నం హోటల్ యజమాని టెలిగ్రాం అతని గదికి పంపించాడు.

కాని, ఇక్కడ, ఏడోరోజున చనిపోయిన శిశువుని అతి ప్రయాసతో డాక్టర్లు బయటికి తీశారు.

ఎనిమిదో రోజు వుదయం.

"అమ్మాయీ!" అన్నాడు రవణయ్య పంతులు. బంధువులూ, స్నేహితులూ లీలావతి మంచం చుట్టూ వున్నారు.

"సెలవు, మామా. బతకాలనే ఆశ నాకు లేదు. ఇక జీవించనని నాకు తెలుసు. వెలుగు నశించిపోయిన తర్వాత ఇంకెందుకు? నాలాంటి మనుషులు చీకట్లో బతికే జంతువులు కారు."

పంతులు ఖద్దరు కండువాతో కళ్ళు తుడుచుకున్నాడు. 'నేనే చేశానమ్మా ఇదంతా, పాపం అంతా నాదే!"

లీలావతి రోగిష్టి నవ్వు నవ్వుతూ అంది. 'అంత చదువుకున్న వాడివి—నువ్వుకూడా యింత బేలతనంగా మాట్లాడుతా వేమిటి?......నాకేకోరికా లేదు,—చనిపోయేలోగా విశ్వాన్ని ఒక్కసారి నా కళ్ళకి పండగగా చూడా

లనే కడసారి కోరిక తప్ప చూడగలనంటావా ? నా ఆఖరు కోరిక తీరుతుందా ?''

పాపం లేదు — ఆమె ఆఖరు కోరిక తీరనే లేదు. ఆ మధ్యాహ్నం మూడు గంటలకే డాక్టర్ పెదవి విరిచాడు.

జీవం లేని కట్టెను చూట్టానికి మర్నాటి ఉదయం బొంబయి మెయిల్ లోనుంచి దిగాడు విశ్వం.

ఏముంది ?

పక్షి ఎగిరిపోయింది; పంజరమే మిగిలింది.

# రైలులో

పూనాస్టేషనులో మావాడు నన్ను రయిల్లో దూర్చాడు. ఈ రయిలువాళ్ళు—మీరు ప్రయాణం చెయ్యొద్దో!—అని అఘోరిస్తున్నారు కనక, స్థలం లేదనే కంప్లయింట్ అనుచితం. టికెట్ దొరకడమే మహాద్భాగ్యం.

నేనంటే దూరానుగాని నా పెట్టె, హోల్డాలూ, కారియరూ ఎలా? నోట్లో ఈలా, చేతిలో జండాతో గార్డు యములాడిలా, రెడీగా వున్నాడు. మా వాడు పెట్టెమీద హోల్డాలు పెట్టి, ఆ మొత్తాన్ని కిటికీలో నుంచి తోసేస్తున్నాడు. లోపల కూచున్న ఒక తలపాగా మనిషి తలతిక్కకి మావాడు వుద్రేకుడై పోయి, సామానుకి ఒక్క పుష్ యిచ్చాడు. తల్లి వొళ్ళో కూచున్న ఒక నాలుగేళ్ళ పిల్ల ఈ మోడరన్ ముష్టియుద్ధపరిణామానికి కెవ్వుమని అరిచింది. కోటఛేదించిన వీరత్వంతో సామానూ, రైల్వే అడ్వర్టయిజ్మెంటు ప్రకారం నా వెంట సతతమూ వుండే కారియరూ నన్ను జేరాయి.

"వెళ్ళగానే ఉత్తరం రాయేం!" అన్నాడు మావాడు.

"మన వాళ్ళందర్నీ అడిగానని చెప్పేం!" అని కూడా అంటున్నాడు.

వల్లూరి జగన్నాథరావుగారి స్లేటు జ్ఞాపకంవచ్చింది— 'ఈ రోజుల్లో పెళ్ళాలు తప్పిపోరు—పారిపోతారు.' అంత

పొడుగు బండికి రాజైన గార్డు బిగిల్ వూదాడు. పెట్టెలలో చైతన్యం కలగ నారంభిస్తోంది. రయిల్ నన్నూ మా వాణ్ణీ వేరు చేసేస్తోంది. పొయిట్రీకి అవకాశం లేని పరిసరాలు— అంచేత మా వాణ్ణి గురించిన తలంపు, అతను నా దృష్టి నుంచి జారిపోగానే తొలగిపోయింది.

పదకొండు అయింది. సాయంత్రం అయిదు గంటలదాకా నేనా రైలుపెట్టెలో మకాం చెయ్యాలి. అంత సేపూ నుంచుంటానా?—చిన్నప్పుడు బళ్ళోకూడా నుంచోలేదే! ఎవర్ని స్థల మడుగుతాను—భాష రాని ప్రదేశాల్లో?

చుట్టూ రా చూశాను. దూరాన్నుంచి ఒక కాకిగుడ్డల మనిషి నన్ను రమ్మని సంజ్ఞ చేస్తున్నాడు. చచ్చినా రైలు పెట్టెలో సందు యివ్వమని ఆర్భాటం చేసే జాతికి నా మీద ఏ కారణం వల్ల కరుణ కలిగిందా అనుకుంటూ వాళ్ళవైపు, ఆంజనేయుడి అంగలతో వెళ్ళాను.

వాళ్ళు ముగ్గురు. తెలుగువాళ్ళు. ముగ్గురూ తొమ్మండుగురి స్థలం ఆక్రమించుకున్నారు. న్యాయసూత్రాలు నేను వారికి చెప్పానా—మాకు తెలుసు మాకంపెనీకి రాసుకో— అంటారు. న్యాయం మాట దేవుడెరుగును, ముందు నా సీటూ, వారు నా మీద చూపే ఆప్యాయతా హుళక్కి అవుతాయి.

కడుపు చేతిలో పుచ్చుకొని బొంబయి వచ్చిన ముగ్గురు భారతీయులు వీరు. ఒకడిది నంద్యాల, మరొకడిది విజయ

నగరం, మూడోవాడి పూరుపేరు మర్చిపోయాను. అంచేత అతన్ని జకరయ్యా—అంటాను. పూనాస్టేషనులో తెలుగు మాట్లాడే నన్ను చూడగానే వారికి ప్రాణం లేచివచ్చి నట్లయింది.

తాము పరుచుకున్న బెడ్డింగు మీద నన్ను ఆశీనుణ్ణి చేశారు. నన్ను మర్యాద చేసేందుకు నానా యిబ్బందీ పడటం మొదలెట్టారు ముగ్గురూను. వాళ్ళ ఆకారల గురించీ వైఖరిగురించి చెప్పడమనవసరం. నిత్యమూ కనిపించే కాకి సరుకులో యివి మరో మూడు—దేశీయరక్షణ సైన్యంలోని అంగాలబాపతు.

ఒకడు సిగరెట్టుపాకెట్ ఆఫర్ చేశాడు. మరొకడు నా నిమిత్తార్థం జామపళ్ళు కొన్నాడు. మూడోవాడు నాదగ్గిర తెలుగు పుస్తకాలేవైనా వుంటే చదువుకునేందుకు యివ్వ మన్నాడు. 'పుస్తకం—వనితా—విత్తం' ఇలాంటి ఆర్యో క్తులు పత్రికల్లో బాగా చదివివున్నవాణ్ణి అవడంచేత, ఏం జవాబు చెప్పనా అని ఆలోచిస్తూ వుండగానే, నా ఆలోచన ఒకకొనసకి తేలక పూర్వమే ఆ మహానుభావుడు 'తాతలనాటి క్షేత్రములు...' అంటూ అందుకున్నాడు. ఆ బాక్ గ్రవుండ్ మ్యూజిక్ కి నా పాసింగ్ షో పొగలు నాట్యమాడాయి.

"జామపండ్లు నాకు సయించవు," అన్నాను, అణా కొకటి చొప్పున కొని, నాకు అరడజను ప్రజంటు చేసిన నంద్యాలమనిషితో.

"మీరు తినాలి, సార్ !" అన్నాడు.

మా దొడ్లో ఒక జామచెట్టువుంది. అది ప్రతి సంవత్స రమూ విరగ కాస్తుంది—అంచేత నాకు జామపళ్ళు నయిం చవు. వాసన కూడా గిట్టదు.

"తర్వాత తింటాను," అంటూ పక్కని పెట్టాను, ఆ ఫలాలు

నేను వాళ్ళ పేర్లు అడగలేను. ఎంచేతనంటే, పోలీసు వాళ్ళకీ మిలిటరీవాళ్ళకీ పేర్లు జీవించివుండవు. వారికుండేవి నెంబర్లే. 'తొమ్మిదిపైన అంతా అయోమయమే!' అనే వేదాంతుల మాటల్లో నాకు విశ్వాసం పోలేదు.

"మీరు ప్లీడరీపరీక్ష యిచ్చివచ్చారా ?" అన్నాడు, విజయనగరం.

ఇంకా నాకా దౌర్భాగ్యం పూర్తిగా పట్టలేదని మన సులో అనుకుంటూ, పూనా ప్లీడర్లని తయారుచేసే ఫాక్ట రీగా భ్రమిస్తున్న అతగాడితో 'లేదు,' అన్నాను క్లుప్తంగా.

"అయితే నెహ్రూగారెక్కడున్నారు ?" అన్నాడు.

"నాకు తెలీదు," అన్నాను.

"నెహ్రూ గొప్పా గాంధీ గొప్పా ?—చెప్పండి !" అన్నాడు మూడో ప్రశ్నలో.

బహుశా, పూర్వకాలంలో రాజకుమార్తెలు రాజ కుమారుల్ని యిలాంటి ప్రశ్నలే వేసి, సమాధానాలు చెప్ప

లేక పోయారని తలలు ఖండించే వారు కాబోలు! నేనేం చెప్ప గలను—నెహ్రూ గొప్పా, గాంధీ గొప్పా? ఏ అమెరికాగారో సెలవియ్యాలి యిలాటి విషయాలు.

ఇంతలో ధోండ్ స్టేషన్ వచ్చింది. పెట్టెబాగా పల్చ బడింది. నంద్యాల మనిషీ జకరయ్యా రైల్లో సాపాటు చేశారు నన్నుకూడా చెయ్యమన్నారు. చేసేబయద్దేరానని చెప్పుకున్నాను. విజయనగరం పూరీలతో పొట్టనింపు కున్నాడు— నెహ్రూ గొప్పా గాంధీ గొప్పా తేల్చిచెప్ప లేని నా 'యింటెలిజెన్స్' మీద అతనికి కసింత గౌరవం తగ్గింది.

ధోండ్ దాటినతర్వాత రైలు, మస్తుగాతిని ఆవలిస్తూ ఆఫీసుకి బోయే గుమాస్తాలా నడవడం మొదలెట్టింది. జామ పళ్ళు తినమని నంద్యాల మనిషి ప్రతి పావుగంటకి రిమైండ్ చేస్తూనే వున్నాడు. ఎదర బల్లమీద కాస్త అయిమూలగా కూచున్న ఒక సాయిబులమ్మాయి, పన్నెండేళ్ళది, ముగ్గురు యోధుల మధ్యావున్న నన్ను పావుగంట నుంచి పరకా యించి చూస్తోంది. ఆ అమ్మాయికి ఎదురుగా, అంటే నా బల్లమీదనే నాకు కాస్త ఎడంగా కూచున్న—ఒకమరాటీ మనిషి మేం మాట్లాడే భాషని నోరు తెరిచి వింటున్నాడు. ఏమిటేమిటో అడిగారు వాళ్ళు నన్ను, డిక్షనరీలూ, రిఫ రెన్సు బుక్కులూ, లాబరేటరీలూ అవసరంలేని ప్రశ్నలకి సమాధానాలు చెప్పాను.

జకరయ్య, 'మీరేప్రాంతం?'

"బెజవాడ ప్రాంతాల."

ఛాన్సు పోగొట్టుకోవడం యిష్టంలేని విజయనగరం, 'విజయనగరం ఎలా వెళ్ళాలి?' అన్నాడు.

"రాత్రి ఒంటిగంటకి ఈబండి వాడీ వెళ్తుంది. అక్కడ దిగాలి. అక్కడ నైజాంబండి ఎక్కితే, అది తిన్నగా మర్నాడు సాయంత్రానికి బెజవాడ తీసుకువెళ్తుంది. ఆ రాత్రి బెజవాడలో మకాంచేసి మూడోరోజు వుదయం కలకత్తా మెయిల్ ఎక్కితే, అది విజయనగరం సాయంత్రం నాలుగు గంటలకి వెళుతుంది,' అని రైళ్లూ, టైములూ, భోజనవసతులూ తత్సంబంధమయిన వన్నింటినీ గురించి విపులంగా ఒక పావుగంట ఉపన్యాసం యిచ్చిన తర్వాత...

"మద్రాస్ మీదుగా వెళ్ళాలన్నాడే మా హావల్దారు," అన్నాడు నా రైలు శిష్యుడు.

"ఇంకో రోజు ఆలస్యమవుతుంది. చుట్టు ప్రయాణం."

"మా హావల్దార్ గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్ ఎక్కి వెళ్ళాలన్నాడు. అది వాడీలో వుంటుందా?"

ఏమనను? ఇంకాసేపు వుంటే ఇతగాడు నాకు ఎక్కాలు వచ్చునా రావా అని సంశయించేటట్లు వున్నాడు. నంద్యాల మనిషి నన్ని చెర నుంచి తప్పించి, తరవాత ఆగినస్టేషన్‌లో టీ, గీ తెప్పించి, ముగ్గురి తరఫునా నన్ను సన్మానం చెయ్యడం మొదలెట్టాడు,—కవినీ నావలిస్ట్‌నీ అని తెలీక పోయినా,

నంద్యాలమనిషి జామపళ్ళ సంగతి యింకోసారి జ్ఞాపకం చేసి, తనో సిగరెట్టు ముట్టించి నాకొకటి యిచ్చాడు. 'గరన్ గరన్ ఛా తాగిన హుషారులో అన్నాడు జకరయ్యతో: 'నేను నంద్యాల్లో దిగ్గానే భోగందానింటికి వెళ్ళేమాట నిజం.'

జకరయ్య కళ్ళు తేలేసి చొంగకారుస్తూ 'అలాగా!' అన్నాడు. పాపం! అతనికి పెళ్ళాం లేదు కాబోలు. ముగ్గురి లోకి కుర్రాడతను. కరువురోజుల విషయం అతని స్ఫురణకి రాగా, బ్రాహ్మడి జందెంలాటి పేబుక్ తెరిచి, తనెంత నిలవ వుంచుకుంటున్నదీ, తల్లికి ఎంత పంపిస్తున్నదీ నాకు చూపిం చాడు. తల్లి యింకో ఏడాది పోయిన తర్వాతో, పటాలం నుంచి వెనక్కి వచ్చిన తర్వాతో పెళ్ళి చేస్తానందట. నెలకి నలభై మూడున్నర సంపాయించే తమ ప్రయోజకత్వానికి మురిసిపోయే అమాయకపు జకరయ్యలు నా కళ్ళముందు తాండవించారు. ఎన్ని ఆసలో, ఎన్ని కోర్కెలో ఆ వెర్రి హృదయాలలో!

విజయనగరం మాత్రం గ్రాండ్ ట్రంక్ ఎక్స్ప్రెస్ వాడీ ఎందుకు రాదా అని ఆలోచిస్తున్నాడు.

నంద్యాలమనిషి అమాంత్రం జేబులోనుంచి ఒక పాకెట్ తీసి, దానిమీద రాసివున్న యింగ్లీషుకి తెలుగు చెప్ప మన్నాడు. అది మిలిటరీవాళ్ళకి సప్లయిచేసే సుఖరోగాల మందు. ఫలానా అన్నాను. అతను అంతటితో తృప్తిపడ

లేదు. ఉపయోగించే పథానమూ పూర్తి వివరాలూ నా దగ్గిర్నుంచి వినాలనివుంది పాపం! అలావినడం అతనికి కొంత మానసిక సౌఖ్యాన్ని యిస్తుంది.

నంద్యాలమనిషి తన పూర్వజీవితమంతా నాముందు—నాకు చెప్పాలనే అభిలాషఎందుకో?—'కన్‌ఫెస్' చేశాడు. ఆత్మకథలు పెద్దపెద్ద పుస్తకాలుగా రాసేవాళ్ళు ఈ పాటి నిజాలు చెప్తూవుంటే చాలుననిపించింది.

నాలుగున్నర దాటింది. కురుద్వాడీ వచ్చింది. నేనక్కడ దిగి పోతాను, కూలివాడు నా సామాను దించాడు. విజయనగరం హడావిడిగా బెడ్డింగ్ చుట్టేసి, టోపీసర్దుకొని, పెట్టె చేతిలో పుచ్చుకున్నాడు.

"ఇదేమిటి?" అన్నాను, అతనితో.

"మీరూ బెజవాడేగా!—వాడీలో దిగాలన్నారుగా!"

"నేను బెజవాడ వెళ్ళుతున్నానని అనలేదు. మా స్వగ్రామం బెజవాడ ప్రాంతాల—అన్నాను. ఇది కురుద్వాడీ—వాడీ కాదు. వాడీ రాత్రి ఒంటిగంటకి వస్తుంది," అన్నాను.

నంద్యాలమనిషికీ జకరయ్యకీ విజయనగరాన్ని వేళాకోళం చెయ్యడానికి వీలు చిక్కింది. అతగాడి రెండుజబ్బలూ చెరొకరూ పట్టుకున్నారు. ప్లాట్‌ఫారం మీదికి వచ్చి నాకు నమస్కారం చేశారు, గుర్రాలులేని ముగ్గురు రౌతులూ—అవ్యక్తంలో నుంచీ, అవివేకంలో నుంచీ తొంగిచూస్తున్న

వారి తెనుగుతనానికి నా గుండె సానుభూతితో కొట్టు కుంది.

నంద్యాలమనిషి అమాంత్రం పెట్టెలోకి ఎక్కి, నేను మర్చిపోవాలని మర్చిపోయిన జామపళ్ళు ఆరూ, రెండు చేతుల్లోనూ యిముడ్చుకు వచ్చాడు. అన్ని వద్దన్నాను. రెండైనా తీసుకోవాలన్నాడు. ఒక్కటి చాలన్నాను. అందుకే తృప్తిపడ్డాడా అల్పసంతోషి.

ఒక చేత్తో కారియరూ ఇంకోచేత్తో మిలిటరీ జామపండూ పుచ్చుకు, యాస్పిరిన్ అడ్వర్టయిజ్ మెంట్ తాలూకు 'ముగ్గురు కొతులు' ఫిలిం చూసి చాలా రోజులయిందను కుంటూ, బార్సుబండి వైపుగా దారితీశాను.

———

# పండగ చీరె

సోమశేఖరం దేవి యిచ్చిన వక్కపొడిసీ, తమలపాకుల్నీ మిళితంచేసి, బుగ్గకింద వుంచుకుని నెమ్మది నెమ్మదిగా నమలుతూ వీధి అగురుమీదికి వచ్చాడు. అరుగు అవతల తట్టున రామప్ప పంతులు ధాష్టీకంగా కూచుని అనుభవాలతో నెరసిపోయిన తలవెంట్రుకల్ని రెండు నిమిషాలకో తూరి సవరించుకుంటూ, 'పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్' అన్న శాస్త్రవాక్కు త్రికరణశుద్ధిగా నమ్మిన నియోగపు బ్రాహ్మడిలా పొగాకు చుట్టలోవున్న మజా అనుభవిస్తున్నాడు. కాసేపు చుట్ట చప్పరిస్తున్నాడు. కాసేపు వుమ్ముతున్నాడు.

శేఖరాన్ని చూడగానే 'ఏమోయ్ శేఖరం కూచో' అన్నాడు. శేఖరం అరుగుమీద కూచున్నాడు.

ఒక్కక్షణం ఆగాడో లేదో, 'శేఖరం, లంకపొగాకు చుట్టలోవున్న మాధుర్యం......'

ఇంకా ఏమిటో అనబోయాడు. బహుశా—ఆరేళ్ళకి పూర్వం జనన మరణ ఆఫీసులోని మరణపట్టీలో పేరు దాఖల్ చేయించుకొన్న తన అర్థాంగి అధర సుధారసంలో కూడా లేదని అందా మనుకున్నాడో ఏమో! సోమశేఖరం అతణ్ణి పూర్తి చెయ్యనిస్తేకదూ!!

"లంకపుగాకు చుట్టలో మాధుర్యం వున్నా, గోల్డ్‌ఫ్లేక్ ముందు అది గాస్‌లైట్ ముందు ఉన్న దివిటీలాంటిది. 'అంటూ శేఖరం జేబులోని పాకెట్ తీసి ఒక సిగరెట్ ముట్టించాడు.

"సిగరెట్టు గుండెల్ని ఆర్పేస్తుంది. చుట్ట ఆరోగ్యకరం."

సోమశేఖరం సిగరెట్టు పొగ ఉంగరాలు, ఉంగరాలుగా తెల్లటి వెన్నెల్లోకి వదులుతూ అంబరవీధిలోని నక్షత్ర పంక్తిని శూన్యదృష్టితో పరికిస్తూ ఏమని జవాబు చెప్పడమా అని యోచిస్తున్నాడు. జవాబు అతని బుర్రలో ప్రవేశించనూ లేదు. నాలుకనుంచి వెలువడనూ లేదు. పంతులు అందుకొన్నాడు. 'అమ్మాయికి ఏం చీర కొన్నావోయ్ ! దీపావళికి ?"

దసరా వెళ్ళి నెలన్నా తిరగలేదు దీపావళి తయారైంది... దేవి దసరాకి సరదాగా రెండు చీరెలు కొనుక్కుంది. ఒకటి చాలని శేఖరం ఎంత చెప్పినా వినలేదు. మహార్నవమికి వో చీరె—విజయదశమికి వో చీరె అంటూ ఆమె పట్టుపట్టింది. శేఖరం కాదనలేకపోయాడు. అతని డెబ్బైయిరూపాయిల జీతంలోంచి యిరవైరూపాయిలదాకా చీరెలే కబళించేశాయి. యింక జీతం రాలేదుకాని దీపావళి వచ్చింది.

"మొన్న పండక్కి రెండు చీరెలు కొనుక్కుందండీ;" అన్నాడు శేఖరం.

"అయితే మాత్రం..."

శేఖరమూ, పంతులూ బంధువులు కారు. ఒకరు యింటి యజమానులు. యింకోరు ప్రతినెలా రెండోతారీఖున పది రూపాయిల ముడుపూ చెల్లించుకునేవారు. శేఖరం పంతులు యింట్లోకి వచ్చి ఏడాది దాటుతుంది. పంతు లంటే శేఖరానికి పెద్దవాడనే పూజ్యభావమే కాకుండా హుషారుగా

కబుర్లు చెప్పగల చెలికాడనే స్నేహభావంకూడా వుంది. పంతులు దేవిని 'అమ్మాయీ' అని సంబోధించడమూ, శేఖరాన్ని శేఖరం అనడమూ ఆదినుంచి రివాజై పోయింది. భార్యా భర్తల మధ్య అప్పుడప్పుడు తలవని తలంపుగా అకారణంగా,అంకురార్పణ అయ్యే ప్రణయ కలహాలు రూపు మాపడంలో పంతులు ప్రతిభ అసమానం.

"అయితే మాత్రం..." అని వూరుకోవడంలో పంతులు వుద్దేశం 'మళ్ళీ యింకో చీర కొనాలోయ్' అని. ఆ అభిప్రాయాన్ని శేఖరం గ్రహించక పోలేదు.

"ప్రతి పండక్కీ కొత్తచీర కొంటూంటే సంసారం ఎలా గడుస్తుంది ?"

"గడవక ఆగుతుందా ? మహాచక్కగా గడుస్తుంది; ఆగడ మేమిటోయ్ ! యీ ప్రపంచంలో అన్నీ గడుస్తూనే వుంటాయి" అన్నాడు వేదాంతం మాట్లాడుతున్న వాడిలా.

"దేవి నిన్నెదో మాటవరసకి అంది లెండి. లెక్కల మేష్టారు పెళ్ళాం సిల్కుచీరె కొనుక్కుంది. ఎంత బావుం దనుకున్నారూ !" అంది ఏదో మామూలు ఫక్కీలో చెప్తోం దనుకొన్నాను."

"మామూలూ లేదు; యానామూ లేదు. పండక్కి అలాటి చీరె కొనమని ఆ అమ్మాయి వుద్దేశం...యీ కాలపు వాళ్ళు కొద్దిగా నయమేనోయ్ ! ఏదైనా చెప్తే అర్థం కాకపోయినా అర్థం చేసుకునే ప్రయత్నమైనా చేస్తారు. పూర్వపు వాళ్ళు...రామ ! రామ ! ! మా యింటిది"

శేఖరానికి పంతులు తన 'యింటిదాన్ని' గురించి చెప్తూ వుంటే విసుగు. అతనికి పంతులు అనుభవాలు ఆకర్షించడం రోతకింద మారింది. పంతులు అతని కన్నీ చెప్పాడు. తను కాకినాడలో మొట్టమొదట ఏ భోగందా నింటికి వెళ్ళాడో, ఆమె ఎలా మోసం చేసిందో, అవధానులుగారితో మాట పట్టింపువచ్చి హైకోర్టుదాకా వెళ్ళి, తన దావా ఎలా నెగ్గించుకున్నాడో, భార్యని ఏప్రకారం చితకమోదే వాడో... ఇవన్నీ శేఖరం తృణ్ణంగా విన్నాడు. యిక అతను పంతులు ఆత్మకథ వినలేడు. కాని పంతులు వూరుకుంటేనా ??

పాతికేళ్ళకి పూర్వం సంక్రాంతి పండగనాడు తన భార్య కొత్తచీరెకోసం ఎలా మారాము పెట్టిందో, సంస్కృత శ్లోకాలతో సహా వల్లించడం మొదలెట్టాడు. ఆ మారాము చెయ్యడంలో వున్న సౌందర్యమూ, చిలిపితనమూ, కవిత్వ ధోరణిలో చెప్పడం ఆరంభించాడు. పంతులు చిన్నబుచ్చు కుంటాడేమోనని శేఖరం లేని వోపిక తెచ్చుకొని ఐదునిము షాల కాలంవిన్నాడు. ఇక వినలేనని నిశ్చయించుకున్నాడు. లేవబోతూ వుండగా గుమ్మంవద్ద దేవి ప్రత్యక్షమైంది.

"నాకు నిద్దర వస్తోంది. నేను పోయి పడుకుంటాను. తలుపు వోరవాకిలిగా వుంచుతాను," అంది కోకిల కంఠంతో 'ఇక కబుర్లకి స్వస్తిచెప్పి లోపలికి వేంచెయ్యండి' అన్న భావాన్ని తెలిపే, అధికారంతో కూడిన ఆహ్వానం. ఆ పలుకుల అంతరార్థం, ఆమె వుద్దేశం శేఖరం గ్రహించగలిగాడు. కాని పంతులు ముందు తన సహధర్మచారిణి మంచితనాన్ని ప్రదర్శిద్దామనే వెర్రియత్నం చేశాడు.

"దీపావళికి నేను కొత్తబట్టలు కొనుక్కోను. నువ్వు కొత్తచీర కొనుక్కోవద్దు," అన్నాడు అర్థాంగితో.

"ఏం ?" అంది దేవి.

"ఏమీలేదు."

"ఇదేమిటి బాబుగారూ ?" అంది దేవి పంతుల్ని ఉద్దేశించి.

"ఏమోనమ్మా నాకేం తెలుస్తుంది ? ప్రతి పండక్కీ కొత్తచీర కొంటూ వుంటే సంసారం ఎలా గడుస్తుంది, అంటూ అడుగుతున్నాడు నీభర్త—" అన్నాడు పంతులు దొరికిన అవకాశాన్ని సద్వినియోగంచేస్తూ.

దేవి భర్తమీద దండెత్తింది.

"ఎందుకు గడవదూ ? ? ? సిగరెట్లు మానేస్తేసరి ! ప్రతి పండక్కీ అన్నమాటేమిటి, ప్రతినెలా ఒకొక్క చీరె చొప్పున నేను కొనుక్కోవచ్చును,—ఆ సిగరెట్టు తగలెయ్యడం మానేస్తే."

శేఖరం ప్రశ్న : 'నువ్వు చీరెలు కొనుక్కునేందుకు నేను సిగరెట్లు మానెయ్యాలా ?"

దేవి ప్రశ్నకి ఎదురుప్రశ్న వేసింది. 'మీకు కొత్తబట్టలు కొనుక్కునేందుకు మనస్సు ఒప్పదు కనక నేను కొత్తచీరె కొనుక్కోవడం మానెయ్యాలా ?'

ముందు ఏప్రకారం వెళ్ళాలో శేఖరానికి పాడగట్టలేదు. యుగ యుగాల్నించీ వస్తూవున్న పురుషుడి అధికారం ప్రదర్శిద్దామనే ప్రయత్నం చేశాడుకాని దేవిపట్ల ఆగుడ్డి సిద్ధాంతాలు మారని దమ్మిడీలు అయిపోతాయనే వివేకం అతనికి

సమయస్ఫూర్తిగా కలిగింది. గట్టిగా మాట్లాడితే భర్త సంపాయించే డెబ్బై రూపాయల్లోనూ సగము తనదీ, మిగతా సగమూ భర్తవీ అని నిరూపిస్తుంది దేవి.

పంతులు తనలో తను నవ్వుకుని ఆరిపోయిన చుట్ట వెలిగించాడు. కథ అడ్డంగా తిరిగిందంటూ శేఖరం యింట్లోకి నడిచాడు. దేవి లోన గడియపెట్టింది.

ఆరాత్రి మొగుడూ పెళ్ళాం కబుర్లలో దేవి కొత్తచీర ప్రశంస తీసుకురాలేదు. ఆ ప్రస్తావనకి అది టైము కాదనుకొంది.

రెండురోజులు గడిచేటప్పటికి 'పండుగ ఎల్లుండి' అనే రోజు వచ్చింది.

ఆ రోజు వుదయం పదీనలబై అయిదు నిమిషాలవరకూ కొత్తచీరె విషయం ఎవరూ ప్రస్తావించలేదు. ఆ లౌక్యంలో వున్న నిగూఢత్వం వారికే తెలియాలి.

శేఖరం కోటు తగిలించుకుని, తన భార్య చుట్టియిచ్చిన చిలుకలు నములుతూ హాలులోకి వచ్చేటప్పటికి, అంత వరకూ వంటవసారా తలుపు నానుకొని వయ్యారంగా నుంచుని అతని రాకకోసం నిరీక్షిస్తున్న దేవి, 'ఏమండీ, మ రి—సాయింత్రం—యింటికి వచ్చేటప్పుడు మర్చిపోకండి' అంది, తనమాటలు విన్న తర్వాత అతని ముఖ కవళికలో కలిగే మార్పుని వోరకంట పరిశీలిస్తూ.

"ఏమిటి ?"

"కొత్తచీర"

"పండక్కి యిద్దరమూ కొత్తజట్టలు కొనుక్కోవడం మానేద్దామని—"

"ఊహూఁ, అదెలా కుదురుతుంది? జూలైలో మీరు డజను పంచెలు కొనుక్కున్నారు డజను షర్టులు కుట్టించుకున్నారు. అప్పుడు నాకు చీరెలు కొన్నారా, కొనమని నే నడిగానా? మీరు ఒక్కదఫాను కొనుక్కుంటే నాకు Instalment Basis మీద డజను కావాలి. ఆ Instalments పండగలు"

అవును. శేఖరం జూలైలో డజను షర్టులు కుట్టించుకున్నాడు. డజనుపంచెలు కొనుక్కున్నాడు. దేవి కప్పుడు ఒక్కచీరెకూడా కొనలేదు. కొందామనే కోరిక అతనికి లేకపోయింది. కొనిపించుకుందామనే అభిలాష ఆమెకి లేకపోయింది.

శేఖరం టైమైపోయిందని సాకుచెప్తూ ఆమెకి సరిగ్గా సమాధానం చెప్పకుండా వీధిలోకి పడ్డాడు. కాని దేవి వీధి గుమ్మం దాకావచ్చి మందహాస వదనారవిందంతో 'మొన్న లెక్కలమేష్టారి పెళ్ళాం కొనుక్కున్న చీరె చూపించాను చూశారూ అలాటిచీరె, తీసుకురండి.' అంటూ అతన్ని సాగనంపింది, వెనుదిరిగి చూడకుండా అతను నడవసాగాడు.

ఆలోచనలతో మునిగిపోయింది అతనిబుర్ర. ఆఫీసులో కూచున్నాడన్న మాటేగాని క్రొత్తచీరె కొనడమా కొనకపోవడమా? కొంటే? పర్సులో పదిరూపాయిలే వున్నాయి. ఫస్టు తేదీ యింకా పదిరోజులు పైగావుంది. బాంకులోవున్న నిల్వ బాపతు సొమ్ము తీయడానికి ఏమాత్రం మనస్కరించ

లేదు. కొనకపోతే?...కొనకపోతే?...ఏముంది? ఏముం దేమిటి...ఏమీ లేదు. దేవికి కోపం వస్తుంది...కోపం వస్తే?...

ఆమె కోపానల జ్వాలలకి తను భయపడడమా? భయ పడడమనే విషయం శేఖరాన్ని కలవరపెట్టింది? ఆ ఆలో చనే అతన్ని బెంబేలు పరచింది. ఒక ఆడదానికి, మీదు మిక్కిలి కట్టుకున్న భార్యకి భయపడడం అతనికి న్యూనతగా తోచింది. తల్లికి భయపడడంలో ఒక గౌరవం వుందనీ, అక్కకి భయపడడంలో ఒక మర్యాద వుందనీ, భార్యకి భయపడడం చేతకానితనాన్నీ. అల్పత్వాన్నీ, అవివేకాన్నీ సూచిస్తుందని శేఖరం అనుకున్నాడు. దేవికి కొత్త చీర కొనడం తనకి సొమ్ము వుండగే కాకుండా ఆమెకి లొంగిపోవ డమూ జంకడమూ, ఆమెదృష్టిలో లోకువ అయిపోవడం కూడాను.

ఆ సాయంత్రం గుమ్మంవద్ద ఆతురతతో కనిపెట్టుకువున్న దేవి రిక్తహస్తాలతో వస్తున్న భర్తవంక ఒక్కసారి చుర చుర చూచి కోపాగ్ని దిగమింగింది. అతను గుమ్మంలో అడుగుపెట్టగానే, రాని చిరునవ్వు తెప్పించుకుని "బజారులో చీరెలు అయిపోయాయి కదండీ?" అంది.

"అవును," అన్నాడు అతనుకూడా.

ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులోపోసి, తీసుకువస్తూ "అయి పోతాయి" అంది దేవి నిందాగర్భంగా.

కలహాకంఠిలా అయిపోతుందని ఊహించుకుంటూ వచ్చిన శేఖరానికి ఆమె ప్రవర్తన ఆశ్చర్యం కలిగించిందంటే వింత

కానేరదు. అతను చాలా గొడవగా ఫీలయ్యాడు. అతనికి ఏమీ అర్థమవలేదు. ఆలోచించేందుకు బుర్ర పనిచెయ్యనని ఎదురుతిరిగింది.

పండగనాడు ఉదయం అయ్యరుగారిచ్చిన యిడ్లెన్లు ఫలహారంచేసి దేవిగారిచ్చిన కాఫీ సేవించి, చాతుర్ముఖ పురాణ నిమిత్తమై శేఖరం స్నేహితులింటికి వెళ్ళాడు. తిరిగి పది కొండింటికి వచ్చాడు.

వీధితలుపు తెరచుకుని లోనికి వచ్చేటప్పటికి హాలులో ప్రత్యక్షమైంది దేవి—కొత్తచీరతోసహా—శేఖరం తన కళ్ళని నమ్మలేక పోయాడు. ఎండలో రావడంచేత కళ్ళు తన్నే మోసంచేస్తున్నాయేమో అని భ్రమించాడు. జేబు రుమాల్‌తో కళ్ళు తుడుచుకుంటూ అడిగాడు. ఈ చీరె ఎక్కడిది ?

శేఖరం కంగారుచూచి యింకో ఆడదవుతే తన పుట్టింటి వారు ఏదో సమయంలో పెట్టారని బొంకి తరవాత నిజాన్ని వెల్లడించేది. కాని దేవి, ఆరకం స్త్రీ కాదు. ఈ ప్రపంచంలో ఏ విషయంగురించి అయినాసరే అబద్ధమాడవలసిన అవసరంలేదని ఆమె నమ్మకం.

"కొనుక్కున్నాను." అంది దేవి,

"డబ్బెక్కడిది ?"

"బాబుగారిని అప్పుఅడిగాను—మేష్టారిభార్యా తెప్పించింది."

"బాగా నేవుంది."

"బావుండక ?"

"..............."

"యీనెల అద్దె యిచ్చేటప్పుడు ఎనిమిదిరూపాయలు ఎక్కువగా యివ్వండి."

"నువ్వు అడగడమూ, పంతులు యివ్వడమూ..." ఇంకా ఏమిటో అనబోయాడు.

రామప్పపంతులు చుట్టకాలుస్తూ వీధిగుమ్మంవద్ద సాక్షాత్కరించాడు.

"మీరిద్దరూ కలిసి నన్ను ఫూల్‌ని..." పంతులు శేఖరాన్ని వాక్యం పూర్తిచేయనియ్యలేదు.

"ఉండవోయ్ ! ఉండవోయ్ !! అన్నాడు పంతులు నోట్లో ఉన్న చుట్ట బయటికి తీస్తూ.

"ఈ రభసంతా ఎందుకు ?" మీరుకూడా కొత్తబట్టలు కొనుక్కోకూడదూ ?" అంటూ దేవి ఒక్క చిలిపిచూపు శేఖరంవైపు ప్రసరించింది.

ఆ పద్మనేత్రి తీక్షణబాణాలు అతని పెదవులపైన ప్రయత్నపూర్వకమైన చిరునవ్వు తెప్పించినై.

సమాప్తి.

